యం దొకవైపున గుణకార భాగహారముల లెక్కలను, మఱియొకవైపున సంకలన, వ్యవకలన ఫలితములను దెలిసికొనవచ్చును.

వీని తరువాత 'టైపురైటింగ్', 'గణనము'లు రెండును గలసి యుండు యంత్రములు కొన్ని యావిష్కారమందినవి. వానిలో ఎలిస్, ఎలియాట్ ఫిషర్, హాప్‌కిన్స్, అండర్‌వుడ్ హాన్‌సన్ అను పేరులు కలవి పేర్కొనఁదగినవి. బాక్స్‌బిల్ అనునతఁడు కనిపెట్టిన యంత్రము అద్వితీయమై యున్నది. దీనియందలి టైపురైటింగు గుండీలును, గణనయంత్రపు గుండీలును అడుగుభాగమున కొక్కెముల ద్వారా కలుపఁబడి యున్నవి. సన్నని యొక్కగుండ్ల మూలమున లెక్కల పరిగణనము జరగును. వాణిజ్యవ్యాపారసంబంధము లైన కార్యాలయములం దీయంత్రములవలనఁ గలుగు సాయ మింతని వచింప నలవికాదు. వేలువేలువ్యాపారములకుఁ జెందిన లెక్కలనుదరగతివారీగాఁ గూర్చి వానివివరములను వైతము దెలియఁజేయు యంత్రములు గలవు.

వీనివలన ఖాతాగ్రంథముల (Account Books, ledgers-etc) యవసరమే తప్పిపోయెను. ఇటీవలి యుద్ధము మొదలుకొని వాయుయాన విధ్వంసినుల (Anti-aircraft) యందును, కొన్ని నౌకాశతఘ్నిశాలల (Naval Gunneries) యందును ఉపయుక్తములగు యంత్రములు గనుగొనఁబడినవి. ఇవి గాక జనాభా లెక్కల వివరములకును, తోళ్లను కొలతవేసి లెక్కవేయుటకును యంత్రములు గలవు. ప్రస్తుతము సముద్ర తరంగముల సూచించి లెక్కింపఁ గల యంత్రముల యావిష్కరణమునకై ప్రయత్నములు జరగుచున్నవి.

## అంకగణితచరిత్రాంశములు

ప్రాచీనకాలము :—ఇంతవఱ కంకగణితముయొక్క ముఖ్య సూత్రములను, పరికర్మములను చర్చించుట యైనది. ఈ ప్రకరణము నందు వివిధజాతులవారిలో మొదటనుండి యంకగణిత మెంతవఱకు వృద్ధిఁ జెందినదియు సంక్షేపముగా వ్రాయఁబడును.

### ఫొనీషియనులు ; ఈజిప్షనులు

ప్రస్తుతము లభించిననిదర్శనములనుబట్టి ప్రపంచమునం దెల్ల నంకగణితశాస్త్రజ్ఞానమును సంపాదించినప్రాచీనజాతు లందఱిలోను మొట్టమొదటివారు ఫొనీషియనులు, ఈజిప్షనులు. ఫొనీషియనులు వాణిజ్యవ్యాపారములయం దసమానప్రతిభఁ గాంచినవా రగుటచే వ్యావహారికాంకగణితమునందు మిక్కిలి కుశలు లైరి. కాని వారిశాస్త్రమునం దెంత పరిశ్రమఁ జేసినదియు నిర్ణయించుటకు వారు వ్రాసినగణితశాస్త్రము లేవియు మనకు దొరకలేదు. క్రీస్తుశకమునకుఁ బూర్వము ౧౪౯౧ వ సంవత్సరము ప్రాంతమున "కాడ్మసు" (Cadmus) అను గ్రీసుదేశస్థుఁడు ఫొనీషియనులవలన నేర్చికొని యంకగణితమును తనదేశమునందు వ్యాపింపఁజేసెను.

ఫొనీషియనులవలెఁ గాక ఈజిప్షనులు జ్యోతిషశాస్త్రము కొఱకును, జ్యామితి లేక రేఖాగణితము (Geometry) కొఱకును అంకగణితము నభ్యసించిరి. ప్రస్తుతము నాగరకప్రపంచమునకు లభించిన ప్రాచీనగణితశాస్త్రగ్రంథములలో నెల్ల మిక్కిలి పురాతన మైనది యీజిప్టుదేశమున దొరకెను. ఇది రమారమి ౩౬౦౦ సంవత్సరముల క్రిందట "అహమీసు" (Ahmes) అను గణితశాస్త్రజ్ఞునిచే వ్రాయఁబడినది. ఈగ్రంథము క్రీస్తునకుఁ బూర్వము ౩౦౦౦ సంవత్సరములనాఁటి మఱియొకగ్రంథముయొక్క యనువాదము. గ్రంథకర్త యే వ్రాసికొనియుండెను. కాఁబట్టి యీజిప్షనులకు సుమారు ౫౦౦౦ సంవత్సరముల క్రిందటనే గణితశాస్త్రాభ్యాసంగము గల దని స్పష్టమగుచున్నది. ఇప్పు డీగ్రంథము లండనుపట్టణమునందలి బ్రిటిషు మ్యూజియము (British Museum) యొక్క పుస్తకభాండాగారమునం దున్నది. ఇది నాలుగుప్రకరణముల గ్రంథము. అంకగణితమునకును, రేఖాగణితమునకును సంబంధించిన ప్రశ్నములును, వానికి సమాధానములును గలవు. ప్రశ్నములకు జవాబులుమాత్రమే కలవు గాని యీ లెక్కలు వేయుమార్గములు నివేదింపఁబడి యుండలేదు.

మొదటిప్రకరణమున భిన్నాంకనిరూపణము (Fractional notation)ను, రెండవప్రకరణమున సంకలన, భాగహారవిధులను వాని కుదాహరణములును, మూఁడవప్రకరణమున సమీకరణములు (Equations)ను, నాల్గవప్రకరణమున రేఖాగణితవిషయములును గలవు. ఈజిప్షనుల భిన్నాంకనిరూపణమునుగూర్చి యింతకుముందు వ్రాయఁబడినది. వీరిసంఖ్యాస్వరూపము మనదానివలె "దశాంకము" (Denary notation) గాకపోవుటయే గణితశాస్త్రాభివృద్ధి గాకుండుటకు ముఖ్యకారణ మయినది.

### గ్రీకులు

ఫొనీషియనుల, ఈజిప్షనులతరువాత గణితశాస్త్రము నభివృద్ధికిఁ దెచ్చిన ప్రాచీననాగరకజాతులలో గ్రీసుదేశీయులు ముఖ్యులు. కావున వారిగణితశాస్త్రజ్ఞులలో ప్రముఖులయొక్క గ్రంథములనుగూర్చి యించుక వ్రాయఁబడును.

ప్రాచీనలిఖితపూర్వకములగు నిదర్శనములనుబట్టి మొట్టమొదటి గ్రీకుగణితశాస్త్రజ్ఞుఁడు "థేల్సు" (Thales) అయినట్లు తెలుయుచున్నది. ఈయన క్రీస్తుశకమునకుఁ బూర్వము ౬౦౦ సంవత్సరముల క్రిందటివాఁడు. ఈయనగణితశాస్త్రగ్రంథము లేవియు మనకు లభింపలేదు.

థేల్సుతరువాతను పేర్కొనఁదగినగణితశాస్త్రజ్ఞుఁడు "పైథాగరస్" (Pythagoras) అనునతఁడు. ఇతఁడు వేదాంతశాస్త్రమునందుఁ గూడ మిక్కిలి గట్టివాఁడు. ఈయనవ్రాసిన గణితశాస్త్రగ్రంథమునందు నాలుగుభాగములు గలవు. ఇందు ముఖ్యముగ సంఖ్యాతత్త్వనిరూపణము (Theory of numbers) చర్చింపఁబడి యున్నది. సరి, బేసి, భాజ్యము, అవిభాజ్యము అను నాలుగువిధము లగు భేదములే కాక స్వాభావికాంకములు, త్రికోణాంకములు (Natural and trigonal numbers) అని ఇతఁడు రెండుజాతులుగ సంఖ్యలను విభ

ములసంఖ్య లగును. ఇట్లు కుడివైపున మనమానముతో నొకటి, రెండు అని కొలచుకొనుచు బోయినచో లెక్కకు ఒక్కొక్కసంఖ్య పూర్తియైనచోట నొక్కొక్కబిందు వేర్పడును. ఇట్లేర్పడు బిందువులచే నాక్రమింపబడినది యంకసంజ్ఞాన్యరేఖ. కాని యీరేఖపై ప్రతి బిందువునకును సరిపోవునట్టిసంఖ్య యుండునా? ఉండదు. ఉదాహరణార్థము—ఒకటి బాహువు (Side) గాగల సమచతుర్భుజము నిర్మించి దానిబాహువునే మానముగా గీసి కొలచినయెడల దానికర్ణమునకు (Diagonal) సరిపోవునట్టి సరియైనసంఖ్య లేదు. కాని యీకర్ణమంతపొడవు మనపరేఖపై గుర్తు పెట్టవచ్చును. కావున ఆబిందువునకు సరియైనసంఖ్య లేదు. కావున నది యంకసంజ్ఞాన్యరేఖ కాదు. ఇట్టియంకములు కరణీసంఖ్యారేఖ (Irrational) లనియెదరు. ఈగ్రంథములం దంతలమునుండి కొన్ని క్షేత్రములు (Propositions) సాధించియుండలేదు. ఉదాహరణముగ కొన్ని క్షేత్రముల నిచ్చెదము.

౧౬వ క్షేత్రము:— నాలుగంకములలో మొదటిదానిని, రెండవదాని నిష్పత్తి మూడవదాని, నాల్గవదాని నిష్పత్తితో సమానమగునేని ఆయంకములను మార్చిన మొదటిదాని, మూడవదాని నిష్పత్తి రెండవ, నాల్గవదాని నిష్పత్తితో సమానమగును.

ఎట్లన, అ బ నిష్పత్తి జ డ నిష్పత్తితో సమానమనుకొనుడు. అప్పుడు అ జ నిష్పత్తి బ డ నిష్పత్తితో సమానమగును.

అ.. జ......

బ... డ.........

దీనియుపపత్తి (Proof):

అ బలో నెన్నవయంశమో (బకంటె నెన్నిరెట్లో) జ యనుడ లో నన్నవయంశమే (లేక డకంటె నన్నిరెట్లు పెద్దది). ఈరెంటి సంబంధమునకు వ్యత్యాసము కల్పించినప్పుడు అ జ లో నెన్నవయంశమగునో (లేక జ కంటె నెన్నిరెట్లు పెద్దది యగునో) బ డ లో నన్నవయంశము (లేక అన్నిరెట్లు పెద్దది) అగును. కావున అ జ ల నిష్పత్తి బ డ ల నిష్పత్తితో సమము. ఇదియే మా కిష్టము.

౨౫వ క్షేత్రము:— ఒకయంకము ద్వితీయాంకముచే శేషము లేకుండ భాగింపబడినయెడల మొదటియంకముయొక్కవర్గముకూడ రెండవయంకముచే నిశ్శేషముగా భాగింపబడును.

ఎట్లన, అ బ చే నిశ్శేషముగా భాగింపబడును. జ అ యొక్కవర్గ మనుకొనుము. జ బ చే నిశ్శేషముగ భాగింపబడును.

అ.. ద.. బ... జ....

దీనియుపపత్తి:

అ అంకముతో సమానమైన ద అను అంకము నొకదానిని కల్పించుకొనుము. కావున అ ద లు రెండును బ చే భిన్నములు. అ ద ల గుణితము (గుణాకారము) జ తో సమానము కావున జ కూడ బ చే నిశ్శేషముగ విభాజ్యము.

హిందూజ్యోతిశ్శాస్త్రజ్ఞు లనేకులు గణితశాస్త్రజ్ఞులే. కావున జ్యోతిశ్శాస్త్రచరిత్ర వ్రాయునప్పుడు నాగణితశాస్త్ర విషయములు కల్పింపబడును.

## హిందువులగణితశాస్త్రప్రాముఖ్యము

హిందువులగణితశాస్త్రజ్ఞానమునకు [illegible] మూలపురుషుడని యనుకొనవచ్చును. కొందరు పాశ్చాత్యు లొక గ్రీకువారి హిందువులు తమజ్యోతిశ్శాస్త్రమునందే గణితశాస్త్రములను నేర్చుకొని రని వ్రాసియుండిరి. హిందూగణితశాస్త్రజ్ఞులలో బ్రహ్మగుప్తాచార్యులే మొదటివారని చెప్పవచ్చును. ఈవిషయములను హిందూదేశమున గణితశాస్త్రము అభివృద్ధి చెందుటకు పూర్వమే యేకాలమునను సమసిపోయిన దని నేను చెప్పజాలను: అయినా క్రీస్తుశకము ఆరవ శతాబ్దియందలి మునకే హిందువుల గణితశాస్త్రాభివృద్ధి [illegible] చెందిన దనవచ్చును. ఈకాలమునాటికి పాశ్చాత్యులలో నేనాంక గణితశాస్త్రము [illegible] లేదు. ఇట్టి [illegible] హిందువులను పాశ్చాత్యులు తోడుపడి [illegible].

గణితశాస్త్రాభివృద్ధికి ముఖ్యకారణమైన దశాంశపద్ధతియును, శూన్యనిర్ణయమును హిందువులే మొట్టమొదట కనుగొనిరి. ఈవిషయ మిప్పటికే తెలుపబడినది.

ఇచ్చట నొకవిశేషము చెప్పవలసి యున్నది. దశాంశపద్ధతి హిందూదేశమునం దున్నట్లు స్పష్టముగా సాధారణము లేదని కొందరు చెప్పెదరు. కాని క్రింద నుదాహరింపబడినవేదవాక్యమును, పతంజలి కృతయోగసూత్రముమీది వ్యాసభాష్యమునందలి వాక్యమును జూచినచో నెవ్వరికిని సంశయ ముండగూడదు:

"ఏకా చ దశ చ దశ చ శతం చ శతం చ
సహస్రం చాయుతం చాయుతం చ నియుతం చ
నియుతం చ ప్రయుతం చార్బుదం చ న్యర్బుదం చ
సముద్రశ్చ మధ్యం చ అన్తశ్చ పరార్ధః"

—వాజసనేయసంహిత, ౧౭—౨.

"యథా ఏకా రేఖా శతస్థానే శతం దశస్థానే దశ ఏకం చైకస్థానే" —[3వ పదము ౧౩ వసూత్రముమీది భాష్యము]

క్రీస్తుశకము ఎనిమిదవ, తొమ్మిదవ శతాబ్దులయం దరబ్బులు హిందువులగణితశాస్త్రముల నభ్యసించి వారిగ్రంథములను తమభాషలోనికి తర్జుమా చేయించిరి. తరువాత అరబ్బులు యూరోపుఖండమును ఇటలీ, స్పెయినుదేశములందు ప్రవేశించినప్పుడు పాశ్చాత్యులు అరబ్బులవలన గణితశాస్త్రజ్ఞానమును సంపాదించిరి. పదునారవ శతాబ్దినాటికి హిందువులగణితశాస్త్రపద్ధతులు యూరోపుఖండమున సమగ్రముగ వ్యాపించెను. ఇందులకు తార్కాణముగ పదునాలుగవ, పదునైదవశతాబ్దులలో పాశ్చాత్యులు వ్రాసినగణితగ్రంథములయందు

మనవారు అనాదినుండి చేయుచున్న లెక్కలు కొన్ని గలవు. ఇట్టి లెక్కలు కొంత వింతగనుండు తెలుపఁబడినవి. అట్టిలెక్కలలో మఱియొకదాని నిచ్చటఁ బొందుపఱిచి యీవిషయ మింతట ముగింపఁబడెను. తొమ్మిదిగళ్ళలో వేసినయంకె వేయక యెటు కూడినను ౧౫ వచ్చునట్లు పూర్వ మనకొక గణితసమస్య మనలో ననుశ్రుతముగ వచ్చుచున్నది. ఇందుల కొకసూత్రమును గూడ మనవారు వ్రాసియుంచిరి.

"క. ఆఱు నొక్కటి యెనిమిది
సారసముగ నేడు నైదు సరసను మూఁడున్
క్షీరాబ్ధి రెండు తొమ్మిది
శ్రీరామా! కడమనాల్గు శ్రీరఘురామా!"

| ౬ | ౧ | ౮ |
|---|---|---|
| ౭ | ౫ | ౩ |
| ౨ | ౯ | ౪ |

ఈలెక్కయే పదునైదవశతాబ్దియందు పాశ్చాత్యగణితజ్ఞులచే వ్రాయఁబడిన యొక పుస్తకమునందుఁ గలదు. ఇట్టిప్రస్తావనములనుబట్టి హిందువులు గణితశాస్త్రములను పాశ్చాత్యులకన్న నేర్చినటుకంటె వారికే నాలుగవకు హిందువులు తోడ్పడిరనుట సత్యముగ నుండును.

## ఆంధ్ర గణితశాస్త్రజ్ఞులు: గణితములు

పావులూరి మల్లన్న:—పైనఁ జెప్పఁబడిన గ్రంథము లన్నియు సంస్కృతభాషను వ్రాయఁబడినవి. ఆంధ్రమున స్వతంత్రగ్రంథములు లేకపోయినను పైగ్రంథములయొక్క భాషాంతరీకరణము లున్నవి. వీనిలో మిక్కిలి ప్రాచీనమయినది పావులూరిగణితము. ఇది మహావీరాచార్యుని గణితసారసంగ్రహము యొక్క భాషాంతరీకరణము. గ్రంథకర్త పావులూరి మల్లనామాత్యుఁడు. ఇతఁడు పదునొకండవ లేక పండ్రెండవశతాబ్దియారంభమున నున్నవాఁడు. గోదావరీమండలమునందలి పావులూరుగ్రామమునకుఁ గరణము. ఇది స్వతంత్రగ్రంథము కాకపోయినను పద్ధతులుమాత్రమే మహావీరాచార్యునివి. లెక్క లన్నియు మల్లనార్యుఁడు సొంతముగఁ గల్పించెను. ఈగ్రంథము యొక్క అసంపూర్ణమైనప్రతులుమాత్రము లభించినవి.

వల్లభామాత్యుఁడు:—ఇతఁడు పదునాలవశతాబ్దియాది నున్నవాఁడు. కృష్ణదేవరాయలకును, అచ్యుతరాయలకును సామకాలికుఁడైన బొమ్మలాట కాళిఁ డనువాని ప్రార్థన నంగీకరించి లీలావతి గణితమును తెలుఁగుపద్యములుగఁ జేసెను. ఈసంగతు లీక్రిందిపద్యము వలనఁ దెలియఁగలవు:—

"ఉ. శ్రీనరసింహనందను నరింపమవిక్రముఁ గృష్ణరాయభూ
జానిని వెండియుం దదనుజన్ముని నచ్యుతదేవరాయనిన్
దా నధికాప్తుఁడై కొలిచి తద్దయు మన్నన గాంచి మించువి
ద్యానిధి బొమ్మలాట విరుపాధిపు కాళని ప్రార్థనంబునన్."

ఈ వల్లభామాత్యుని గ్రంథము సంపూర్ణముగ దొరకకపోయినను దొరకినంతవఱకిది చక్కనిభాషాంతరముగఁ గానవచ్చుచున్నది.

మహావీరాచార్యులవారి 'గణితసారసంగ్రహము'ను ఒకవల్లభామాత్యుఁడు తెలుఁగునందును, కన్నడమునందును వ్రాసినట్లు కన్నడగ్రంథమువల్లఁ దెలియుచున్నది. కాని ఆవల్లభామాత్యుఁడును ఈవల్లభామాత్యుఁడును వేఱువేఱువారైనట్లు తోఁచుచున్నది.

ఎలుగంటి పెద్దనార్యుఁడు:— ఇతఁడు ప్రకీర్ణగణితమను పేర భిన్నరాశివ్యవహారములనుగూర్చి యొకగ్రంథమును వ్రాసెను. దీనికాలమును స్పష్టముగ నిర్ణయించుట కాధారములు లేవు.

తడకమళ్ల కృష్ణరావు:— ఇటీవల గణితశాస్త్రములను దెనిఁగించినవారిలో తడకమళ్ల కృష్ణరావుగారు ముఖ్యులు. ఈయన చెన్నపురవాస్తవ్యుఁడు. గోలకొండవ్యాపారి. నలుబదిసంవత్సరముల క్రిందటివాఁడు. ఈయన లీలావతిని భాషాంతరీకరించి రేఖాగణితమును, బీజగణితమును నవీనపద్ధతుల ననుసరించి వ్రాసెను.

సూత్రగణితము:—ఈ పేరుగల గణిత మొకటి కానవచ్చుచున్నది. కాని సంపూర్ణమైనప్రతి దొరకనందున గ్రంథకర్త యెవరైనది చెప్పుటకు వీలు లేదు. ఇందు నొకలెక్క చెప్పుచుఁ బ్రతాపరుద్రుని వర్తకసంబంధమైనచట్టములను సూచించు మ్రాయుటవలనను, 'ప్రతాపపరిభాష' యని వ్రాసి యీక్రిందిపద్యము వ్రాసినందునను ఈగ్రంథము ప్రతాపరుద్రునికాలమందో లేక యాతనిప్రభుత్వము పోయినతరువాత నూఱు, రెండునూర్ల సంవత్సరములలోపలనో వ్రాయఁబడి యుండు నని యూహింపవలసి యున్నది.

### ప్రతాపపరిభాష

"క. గిరు లొక్కనాల్గు మాడయు
నరయఁగ నవి వేసంఖ్య యగు నవి లవఁగా
ధర నాల్గువవిలె లైనను
బరువడిని ప్రతాపమాడ బాగుగ నయ్యెన్."

వేంకటేశగణితము:—ఈ పేర నొకగణితము కలదు. ఇది సంపూర్తిగ దొరకనందున గ్రంథకర్త పేరు తెలియలేదు. ఇందుఁ గొన్ని పద్యములు మహావీరాచార్యునిగణితమునుండి తెలిఁగింపఁబడినవి. మిగిలినవి గ్రంథకర్తచే స్వతంత్రముగ వ్రాయఁబడినవి.

ఈగ్రంథము లన్నిటను లీలావతి తప్పఁ దక్కినవానిలో లెక్కలును సూత్రములునే కాని వానికి వ్యాసములు లేవు. భాషాంతరీకరణములు గూడ మాతృకల ననుసరించియే యున్నవి. పావులూరిగణితమునందలి ఈక్రింది యుదాహరణమువలన నీవిషయము స్పష్టము కాఁగలదు.

లెక్క:—

"సీ. అర్చకుం డొకఁడు దివ్యాబ్జముల్ గొనివచ్చి
మూఁడచ్యుతస్థానములకుఁ జేర్చి
తొలిదేవళంబునుంగలికొలంకునఁ దోఁగఁ
జేతిపువ్వులు యథాస్థితిఁ దలిర్ప

నందుఁ గొన్నిటిని దైత్యారికి నర్పించి
కడమ వానుడితటాకమున నుంచఁ
నతూన్నములు రెట్టఁ దనరఁ బూర్వపురీతి
నర్పించి యాపలికోశంబువలనఁ (?)
గీ. త్రిగుణ మైన మొదలితీరునఁ బరమేశుఁ
బూజ సేసి మిగులుపూలు నల్ల
మూఁట రెంట నొకట మొగి వృద్ధిగా నుంచెఁ
నొలుత నెన్ని దెచ్చెఁ దోయజములు?"

పుష్పముల మొత్తము ౧౧౧. ఇందులకు సూత్రము —

*క. కొడ మును ప్రమాణవృద్ధులు
వరుసను లిఖియించి యంశవర్గంబుఁ బర
స్పరగుణితం బైనను గనఁ
బరఁగుం బూజాప్రమాణపటలం బనఘా!"

ఆధునికపద్ధతి నాంకగణితపాటి మిదవఱకే చెప్పఁబడినది. ఆధునికాంకగణితాభివృద్ధికి ముఖ్యకారణములు మూఁడు గలవు. ఇందు దశమాంశసంఖ్యానిరూపణమును, శూన్యకల్పనమును మొదటివి. ఈ రెండును హిందువులే లోకమునందలి యన్నిజాతులవారికిని ఇచ్చిరి. రెండవది దశమాంశభిన్నరాశి (Decimal notation). ఈ రెంటినిగూర్చి యింతకుముందు సవిస్తరముగ వ్రాయఁబడినది. మూఁడవది "లఘుగణితపద్ధతి" (Logarithms). దీనిని మనవారు కొందఱు 'లాగరిథ' మనియే వాడుచున్నారు. దీనివలన గుణకార, భాగహారములను సంకలన, వ్యవకలనములుగ మార్చవచ్చును. అందుచేత పరికర్మాష్టకవ్యవహారములు సులభసాధ్యములై గణితశాస్త్రాభివృద్ధికిఁ దోడ్పడును. లఘుగణితమునుగూర్చి ప్రత్యేకముగ నొకశీర్షిక క్రింద వ్రాయఁబడును.

వే. వి. శ.

## అంకగణిత పరిభాష *

Addition సంకలనము, కూడిక, సంకలితము, యోగము, యుతి
Alligation మిశ్రగణితము, సువర్ణగణితము
Approximate ఆజమాషు, రమారమి
Arithmetic అంకగణితము, వ్యక్తగణితము, పాటీగణితము
,, mean అంకగణితమధ్యమానము
Arithmetical progression అంకశ్రేఢి (శ్రేణి)
Term పదము, ధనము
First Term ఆదిపదము, ముఖపదము
Middle Term మధ్యపదము
Last Term అంత్యపదము
Number of terms గచ్ఛము, పదసంఖ్య
Common difference చయము
Sum of the series సర్వధనము, పదసంకలనము
Assimilation of fractions అంశసవర్ణము, భాగజాతి
Brokerage కాయిదా, దలాలి
Capital మూలధనము, పెట్టుబడి
Co-efficient గుణకసంఖ్య, గుణకము
Combinations అంకయోగములు
Common Denominator సమచ్ఛేదము
Common measure సామాన్యాపవర్తకము, సామాన్యప్రమాణము
Common Multiple సామాన్యాపవర్త్యము, సామాన్యనిరుద్ధాంకము, నిరుద్ధాంకము, గుణజము
Compound Interest చక్రవృద్ధి, వడ్డీకివడ్డీ
Cube ఘనము
Cube root ఘనమూలము
Decimal దశమాంశము
Denominater హరము, హారము, ఛేదము
Difference అంతరము
Digit అంకము
Dividend భాజ్యము
Division భాగహారము
Divisor భాజకము
Equation సమీకరణము
Evolution మూలక్రియ, ఘాతమూలకర్మ
Exchange వినిమయము
Fraction భిన్నము, అపూర్ణము, కలాసవర్ణము
,, Complex మిశ్ర
,, Compound సంయుక్త
,, Continued వితత
,, Improper విషమ, అపసవ్య
,, Mixed భాగానుబంధ, మిశ్ర
,, Proper సవ్య, సమ
G. C. M. (మహత్తమ, గరిష్ఠ, సామాన్య) అపవర్తకము, గరిష్ఠసామాన్యప్రమాణము
Geometrical Progression గుణోత్తరశ్రేఢి
Common ratio గుణోత్తరము, గుణోత్తరచయము

* తెలుఁగున నిదివఱకుఁ బుట్టినశాస్త్రగ్రంథముల యుపయోగమునకై విజ్ఞానసర్వస్వమునందు ముఖ్యశాస్త్రములకు సంబంధించినవ్యాసములకుఁ బిదప ఆయాశాస్త్రములందలి పరిభాషను చూపుపదములపట్టిక యియ్యఁబడును. శ్రీధరాచార్యకృత గణితసారసంగ్రహము, భాస్కరాచార్యునిలీలావతి, పావులూరిగణితము, జగన్నాథసమ్రాట్టు రేఖాగణితము లయందలి యంకగణితసంబంధమైన ౭, ౮, ౯, ౧౦ అధ్యాయములు, నాగరీప్రచారిణీసభవారి శాస్త్రీయపదకోశము (The Hindi Scientific Glossory), ప్రొఫెసర్ రానడేగారిచే సంపాదితమైన ట్వంటియత్ సెంచరీ డిక్షనరీ (Twentieth Century Dictionary), బ్రిస్టాల్ పరాంజపేగారు వ్రాసిన 'సంక్షేప ...' యన్నగ్రంథమును చూచి యీయంకగణితపరిభాష సిద్ధింపఁబడినది.

# అంకగణితము

Harmonic Progression హారాత్మకశ్రేఢి, సమస్వరశ్రేఢి
Index ఘాతసూచి, సూచి
Infinity అనంతరాశి, ఖహారము
Interest వడ్డి
Inversion వ్యుత్క్రమ, విలోమవిధి
Involution ఘాతక్రియ
L. C. M. (లఘుతమ, సామాన్య) అపవర్త్యము కనిష్ఠ
Measure అపవర్తకము, ప్రమాణము, భాజకము [సామాన్యగుణిజము
Multiple అపవర్త్యము, భాజ్యము, గుణిజము
Multiplicand గుణ్యము
Multiplication గుణకారము, హెచ్చువేత
Multiplier గుణకము
Notation అంకపద్ధతి, అంకసంకేతము, సంఖ్యాలేఖనము
Numeration సంఖ్యావాచనము, సంఖ్యను చదువుట లేక శబ్దము
Number సంఖ్య, రాశి, అంకము [లతో వ్రాయుట
,, abstract నిరుపాధిక, సామాన్య
,, amicable యుగళాత్మక
,, articulate ఉచ్చార్య
,, cardinal సంఖ్యాస్థము
,, commensurable మిత
,, composite గుణజ
,, compound యుక్త
,, concrete సోపాధిక, పరిగణిత, వ్యావహారిక
,, even సమ, సరి
,, evenly even సమసమ
,, evenly odd సమవిషమ
,, figurative సంకలిత
,, incommensurable భిన్న
,, irrational కరణి
,, mixed మిశ్ర
,, natural ఏకాదిక్రమ
,, negative ఋణ
,, odd విషమ, బేసి
,, oddly odd విషమవిషమ
,, perfect పూర్ణ, సిద్ధ
,, polygonal బహుభుజాకార
,, positive ధన
,, prime ప్రధాన, ప్రథమ
, proportion సజాతీయ
,, rational మూలక, సమూలక
,, triangular త్రిభుజాకార
,, whole అభిన్న, పూర్ణ
Operations పరికర్మములు
Par సరాసరి
Partnership భాగస్వామ్యము
Permutations అంకపాశివ్యవహారము
Factorial ఏకాదిచయాంకఘాతము
Purchase and sale క్రయ విక్రయము
Power ఘాతము
2nd Power వర్గము, ద్విఘాతము
3rd Power ఘనము, త్రిఘాతము
4r th Power చతుర్ఘాతము
Practice వ్యవహారగణితము
Premium త్రోపుడు, అడితి
Profit and loss లాభనష్టములు
Proof ఉపపత్తి
Progression శ్రేణి, శ్రేఢి
Proportion యుగ్మనిష్పత్తి, అనుపాతము
Quotient లబ్ధి, లబ్ధము
Ratio నిష్పత్తి
Recurring decimal ఆవర్తదశమాంశము
Remainder శేషము
Result ఫలము
Root మూలము
4rth root చతుర్మూలము
Rule of Three త్రైరాశికము
,, Double Rule of Three పాంచరాశికము
,, Inverse Rule of Three వ్యుత్క్రమత్రైరాశికము
,, First term, measure, or argument ప్రమాణము
,, Second term, demand or requisition ఇచ్ఛ
,, 3rd term ఫలము
,, 4r th term or answer ఇచ్ఛాఫలము
Square వర్గము
Square root వర్గమూలము
Sub-division of a fraction ప్రభాగము
Subtraction వ్యవకలనము, వ్యవకలితము, వ్యుత్క్రలితము, శోధక, పతనము, తీసివేత
Supposition ఇష్టకర్మము
Surd కరణి
Stock నిలువ, రాశిమొత్తము
Unit రూపము
Working న్యాసము

**అంకచక్రము** — మదరాసు రాజధానియందలి గంజాము మండలమున రాజుల రాజ్యపరిపాలనకాలపరిగణనముచేయుటకై యుపయోగింపఁబడు నొకవిధమైన సంవత్సరచక్రము. ఇందు చాంద్ర-సౌరమాన (Luni-Solar) సంవత్సరములు ఏఁబదితొమ్మిదిమాత్రమే యుండును. ఇందలి మాసములన్నియుఁ బూర్ణిమాంతములు. ఈపరిగణనమున భాద్రపద శు ౧౨ తో సంవత్సర మారంభమగును. ఇందలివిచిత్రమేమన, సంవత్సరారంభమైన భాద్రపదశుద్ధ ద్వాదశీదినమును మొదటిదినముగఁ గాక పండ్రెండవదినముగఁ బరిగణింతురు. ప్రతిభాద్రపదశుద్ధ ద్వాదశికి మాత్రము సంవత్సరము మాఱుచుండును.

ఈవిధమైన యంకపరిగణన మెప్పటినుండి యారంభమైనదియు నిశ్చయముగఁ జెప్పుటకు సాధ్యముకాదు. కొంద ఱీది క్రీ. శ ౧౦౭౮ లో సింహాసన మెక్కిన కళింగగంగవంశజుఁడైన అనంతవర్మచోడగంగదేవునుండి యారంభమయ్యెననియు, మఱికొందఱు అంతకుఁబూర్వము నుండియు వాడుకయం దుండెననియుఁ జెప్పుదురు. ఎట్లయినను ఈపద్ధతి క్రీ. శ. పదునొకండవశతాబ్దినుండి కళింగోత్కలదేశముల వాడుకయం దుండినట్లు కళింగమును బాలించిన గంగవంశజులయొక్కయు, గజపతులయొక్కయు శాసనముల ననుసరించి తెలియవచ్చును. గంజాముమండలమునందలి పర్లాకిమిడి, పెద్దకిమిడి, చిన్నకిమిడి జమీన్దారీలలో ఈ 'యంక' పంచాంగమునే యనుసరించెదరు కాని యొక్కొక్కజమీన్దారీకొక్కొక్కప్రత్యేకపద్ధతి కలదు. వేఱువేఱుజమీన్దారీలలో నివారు వారిసంవత్సరములకుఁ దమజమీన్దారుల పేళ్లే పెట్టెదరు. అయినను ఈరాజ్యపరిపాలనకాలపరిగణనమున నన్నిటికి సమానమైనలక్షణ మిది: సంవత్సరసంఖ్యాసంకేతమున ఆఱవసంవత్సరములును, వేసియంకెలు ఆఱుతోఁగాని, (పదమినహాగా) సున్నతోఁగాని యంతమగునో అట్టి సంవత్సరములును వదలివేసెదరు; అనఁగా అయిదు పిదప లెక్కకు వచ్చునది ఏడు; పదునైదునకుఁబిదప పదునేడును, పందొమ్మిదికిఁబిదప నిరువదియొకటియు లెక్కకువచ్చును. ఈవిధమగు పరిగణనపద్ధతికి కారణమేదో తెలియదు. కొందఱాయంకె లశుభసూచకము లని వదలివేసెద రందురు; మఱికొందఱు రాజులరాజ్యపరిపాలనకాలము నతిశయోక్తిగఁ జెప్పవలెననుకోరికతో నిట్లు చేసెద రందురు. ఈలెక్కయందింకొకవిశేష మేమన, 'అంక' వర్షములను ౫౯ కి మించి పరిగణింపరు. ౫౯కిఁ బిదప లెక్కింపవలసివచ్చినచో 'రెండవతడవ ఒకటి', రెండు, అని ప్రారంభింతురు. ఈపద్ధతిలో గమనింపవలసిన మఱియొక ముఖ్యవిషయ మేదన, ఏరాజైనను 'అంక' వర్షమునడుమనే కాలధర్మము నొందినయెడల, అటుతరువాత రాజ్యమునకు వచ్చిన వాని మొదటియంకము అతఁడు సింహాసనారూఢుఁడైననాఁటినుండియే యారంభమైనను అంతటినుండి యాది పూర్తిగ సంవత్సరకాలము నడచుటకు మాఱుగ తరువాతిభాద్రపదశుద్ధ ౧౨ తోనే యంత మగును. ఈకారణమున గతించినవాని కడపటిరాజ్యపరిపాలనసంవత్సరమును, సింహాసన మెక్కినవాని ప్రథమరాజ్యపరిపాలనసంవత్సరమును ఒక్కయేఁటనే పడి, ఒక్కమాఱే యంత మగును. కావున గణుతిలో నొక్కసంవత్సరము లుప్త మగును.

మనకుఁ దెలిసిన యొక 'యంక' వర్షమునకు సరిసమానమైన యింగ్లీషు తేదీ కనుఁగొనవలె నన్నచో మొదట జగన్నాథమునకుఁ జెందినదో, పర్లాకిమిడికిఁ జెందినదో మఱియేపద్ధతికిఁ జెందిన యంకవర్షమో నిర్ణయింపవలసియుండును. పిదప ౧, ౬, ౧౬, ౨౦, ౨౬; ౩౦, ౩౬, ౪౦, ౪౬, ౫౦, ౫౬ సంవత్సరములను దీసివేసి దానియసలుసంవత్సరమును దెలిసికొనవలసియుండును. ఎట్లన, ౧౯ వ యంక మన్న రాజ్యపాలన సంవత్సర మను నన్నచో ౧౯ నుండి (వదలివేయవలసినసంవత్సరములు ౧, ౬, ౧౬ వరకు మూఁడు కావున) పరిత్యాజ్యములైన మూఁడు సంవత్సరములను దీసివేయఁగా అది ౧౬ వ రాజ్యపాలన సంవత్సర మగుచున్నది. ఇట్లే ౩౧ వ యంకము (౧, ౬, ౧౬, ౨౦, ౨౬ వరకు ౫ సంవత్సరములు తీసివేయఁగా) ౨౬ వ రాజ్యపాలన సంవత్సర మగును.

**అంకవగొడుగునూరు** — కడపజిల్లా బద్వేలుతాలూకాయందలి గ్రామము. ఇందలిజనసంఖ్య ౨౫౧.

**అంకపాశవ్యవహారము** — ఇది యొకగణితవిశేషము. నియమితవస్తువులలోనుండి తడవకు రెండు గాని, మూఁడు గాని, అంతకధికముగఁ గాని వస్తువులను దీసికొని వానిస్థలములను మార్చి సంఘ తేర్చినయెడల నెన్నిగుంపు లేర్పడును? ౧, ౨, ౩, ౪ అను నాలుగు అంకెలస్థానములను మార్చి యెన్నివిధము లైనసంఖ్యలను సాధింపవచ్చును? ఇట్లు సాధింపఁబడినయంకెలయన్నిటిమొత్తము మెంత? ఈవిధము లైనప్రశ్నముల కీయంకపాశవిధాన మనుగణితమువలన నుత్తరమీయవచ్చును.

౧ వ ఉదా:— క, చ, ట, త అను ౪ వర్ణము లున్న వనుకొనుఁడు. అందుండి తడవకు రెండురెండుగాఁ దీసికొని వానిస్థలములను మార్చినచో ఎన్నివిధము లైనగుంపు లేర్పడును?

కచ, కట, కత, చట, చత, టత

చక, టక, తక, టచ, తచ, తట

ఇందు నియమితవస్తుసంఖ్య ౪; ఇష్టసంఖ్య ౨. పైనఁ గన్పఱచినప్రకారము ౧౨ విధము లైనగుంపు లేర్పడును. ఈ ౧౨ సంఖ్య యెట్లు వచ్చినది?

వస్తుసంఖ్య యగు ౪ ను అందుండి ఒకటి తీసివేయఁగా వచ్చిన ౩ తో గుణింపఁగా వచ్చెను.

౨ వ ఉదా:— ముగ్గురు బాటసారు లొకపట్టణమునకు వచ్చిరి. అందు నాలుగు పూఁటకూళ్లయిండ్లున్నవి. ముగ్గురును వేఱువేఱు స్థలములం దుండవలయు నన్న వా రెన్నివిధముల బస లేర్పఱుచుకొనఁగలరు?

న్యాసము:—

గ్రామమునందు ౪ పూటకూళ్లయిండ్లుండినందున మొదటివాడు ౪ విధముల బస లేర్పరచుకొనవచ్చును. మిగిలినమూడింటిలో రెండవవాడు ౩ విధములుగమాత్ర మేర్పరచుకొనఁగలఁడు. కాని యీరెండవవాఁడే మొదట బస నేర్పరచుకొన్నయెడల మొదటివాడు రెండవవానివలె ౩ బసలలో నేదియో యొకటి యేర్పరచుకొనవలసినవాఁడగును. కావున వీ రిద్దరును గలసి ౪ X ౩ = ౧౨ విధములుగ బస లేర్పరచుకొనుటకు వీలు గలదు. ఇట్లే మూఁడవవాఁడు మిగిలిన రెండింటిలో ౨ విధములుగ బస లేర్పరచుకొనఁగలఁడు. కావున వీరు ముగ్గురును కలసి బస లేర్పరచుకొనుటకు వీ లయినవిధములు = ౪ X ౩ X ౨ = ౨౪. ఇందు వస్తుసంఖ్య ౪; ఇష్టసంఖ్య ౩. కాన ప్రస్తారభేదములు = ౪ X ౩ X ౨ = ౨౪.

పైన నీయఁబడినయుదాహరణములవలనను, వానివివరణముల వలనను ఈక్రింది సామాన్యనియమ మేర్పడుచున్నది. వస్తుసంఖ్యను మొదటి గుణకముగ నుంచుకొని, అందుండి క్రమముగ నొక్కొక్కటి తగ్గించుచు, ఇష్టసంఖ్య యన్నిగుణకముల నేర్పరచుకొని వాని నన్నిటి నొకదానితో నొకటి గుణించిన వచ్చెడిలబ్ధసంఖ్య “అంకపాశ ప్రస్తార” మగును.

వ అనఁగా వస్తుసంఖ్యయు, ఇ అనఁగా ఇష్టసంఖ్యయు నను కొనినయెడల అంకపాశసూత్రము నీప్రకారము వ్రాయవచ్చును.

$$\text{పా}^{\text{వ}}_{\text{ఇ}} = \text{వ}\,(\text{వ} - ౧)\,(\text{వ} - ౨)\,(\text{వ} - ౩)\ldots\ldots(\text{వ} - \text{ఇ} + ౧)$$

ఇందు నడుమ నున్న ‘పా’ అనునది అంకపాశసంబంధ మైన లెక్క యని తెల్పును.

$$\text{పా}^{౯}_{౪} = ౯ \times ౮ \times ౭ \times ౬ = ౩౦౨౪.$$

$$\text{పా}^{౧౦}_{౩} = ౧౦ \times ౯ \times ౮ = ౭౨౦.$$

౧వ సూత్రము:— ఒకవస్తువును ‘క’ విధములుగాను, రెండవ వస్తువును ‘చ’ విధములుగాను, మూఁడవవస్తువును ‘ట’ విధములుగాను తీసికొనిన ట్లయినచో మూఁడువస్తువులును ఒకే సారి తీసికొను విధములసంఖ్య = క X చ X ట.

మొదటివస్తువును తీసికొను ప్రతియొకవిధమునకును తక్కిన రెండువస్తువులు ‘చ’ విధములఁ దీసికొనవచ్చును.

మొదటివస్తువును తీసికొను ‘క’ విధములకు, రెండువస్తువులు క X చ విధములుగా తీసికొనవచ్చును.

∴ రెండువస్తువులను తీసికొనువిధములు = క X చ.

మొదటి రెండువస్తువులు తీసికొను ప్రతియొకవిధమునకును మొదటి మూఁడువస్తువులు ‘ట’ విధములుగా తీసికొనవచ్చును.

∴ మొదటి ౩ వస్తువులను క X చ X ట విధములుగా గ్రహింపవచ్చును.

౩వ ఉదా:— ౫ ఇంగ్లీషు, ౪ తెనుఁగు, ౩ సంస్కృతగ్రంథములనుండి ౧ ఇంగ్లీషు, ౧ తెనుఁగు, ౧ సంస్కృతగ్రంథము కలసి యెన్నివిధములుగా తీసికొనవచ్చును?

౧ ఇంగ్లీషుపుస్తకమును ౫ విధములుగా తీసికొనవచ్చును.
,, తెనుఁగు ,, ౪ ,, ,,
,, సంస్కృత ,, ౩ ,, ,,

కావున కావలసిన ౩ పుస్తకములను ౫ X ౪ X ౩ = ౬౦ విధములుగా తీసికొనవచ్చును.

౨వ సూత్రము:— ‘వ’ విభిన్నవర్ణములలోనుండి యొకసారి ‘ఇ’ ఇష్టవర్ణములచొప్పున తీసికొనినచో నేర్పడు ప్రస్తారభేదములు

$$\text{పా}^{\text{వ}}_{\text{ఇ}} = \text{వ}\,(\text{వ} - ౧)\,(\text{వ} - ౨)\ldots(\text{వ} - \text{ఇ} + ౧).$$

ఉపపత్తి:— ‘వ’ వర్ణము లున్నవి గదా! అందుండి మొదట ఒకవర్ణమును ప్రత్యేకింప నెంచిన దానిని ‘వ’ విధములుగ దీసికొనవచ్చును.

తరువాత మిగిలిన (వ – ౧) వర్ణములలో నొక్కదానిని వ – ౧ విధములుగ తీసికొనవచ్చును.

పిమ్మట మిగిలిన వ – ౨ వర్ణములలో నొక్కదానిని వ – ౨ విధములుగ తీసికొనవచ్చును.

ఇట్టిపరికర్మములు చేయుచుఁ బోయిన వచ్చెడి విధములు ‘వ’ వర్ణములనుండి తడవకు ‘ఇ’ వర్ణములచొప్పున తీసికొనినచో వచ్చు ప్రస్తారసంఖ్యకు సరి యగును.

$$\therefore\ \text{పా}^{\text{వ}}_{\text{ఇ}} = \text{వ}\,(\text{వ} - ౧)\,(\text{వ} - ౨)\ldots\ldots\text{ఇ గుణకములవఱకు}$$

$$= \text{వ}\,(\text{వ} - ౧)\,(\text{వ} - ౨)\ldots\ldots\overline{(\text{వ} - \text{ఇ} - ౧)}$$

$$= \text{వ}\,(\text{వ} - ౧)\,(\text{వ} - ౨)\ldots\ldots(\text{వ} - \text{ఇ} + ౧)$$

వ = ఇ అయినచో, వ – ఇ + ౧ = వ – వ + ౧ = ౧

$$\therefore\ \text{పా}^{\text{వ}}_{\text{వ}} = \text{వ}\,(\text{వ} - ౧)\,(\text{వ} - ౨)\ldots\ldots ౧$$

$$= ౧ \times ౨ \times ౩ \times \ldots\ldots(\text{వ} - ౧)\,\text{వ}$$

కావున వస్తుసంఖ్యయు, ఇష్టసంఖ్యయు సమాన మైనయెడల ప్రస్తారభేదముల సంఖ్యను కనుఁగొనుటకు ౧ మొదలుకొని వస్తుసంఖ్యవఱకుఁగల యంకెల నన్నిటిని గుణకములుగా నెంచి పరస్పర

గుణనము చేయవలెను. ఇట్టి పరస్పరగుణితరాశి కేకాదిచయాంకగుణక (Factorial) మని పేరు. దీనినే $\lfloor\underline{\text{న}}$ అని వ్రాయుదురు. $\lfloor\underline{\text{న}}$ అనఁగా నొకటి మొదలుకొని ఒకటి వృద్ధిగా న అను సంఖ్యవఱకును గల యంకె లన్నియు నొకదానిచే నొకటి గుణింపఁబడినయెడల వచ్చు సంఖ్య యని యర్థము.

$$\lfloor\underline{\text{౩}} = \text{౩} \times \text{౨} \times \text{౧} = \text{౬}$$

$$\lfloor\underline{\text{౪}} = \text{౪} \times \text{౩} \times \text{౨} \times \text{౧} = \text{౨౪}$$

$$\lfloor\underline{\text{౫}} = \text{౫} \times \text{౪} \times \text{౩} \times \text{౨} \times \text{౧} = \text{౧౨౦}$$

ఇట్లే $\lfloor\underline{\text{౧౦}} = \text{౩౬౨౮౮౦౦}$.

$\lfloor\underline{\text{౩}}$ అను అంకెను మూఁడు ఏకాదిగుణక మనియు, $\lfloor\underline{\text{౫}}$ అను అంకెను అయిదు ఏకాదిగుణక మనియు సంక్షిప్తరూపము నుపయోగించుచు చదువవచ్చును.

౪వ ఉదా:— స, రి, గ అను ౩ స్వరములస్థలములను మార్చి మూఁడు, మూఁడు స్వరములగుంపు లెన్ని యేర్పఱుపవచ్చును?

న్యాసము:—

ఇందు వస్తుసంఖ్యయు, ఇష్టసంఖ్యయు మూఁడే కావున ప్రస్తారభేదములు $= \lfloor\underline{\text{౩}} = \text{౩} \times \text{౨} \times \text{౧} = \text{౬}$.

ఈ ౬ ప్రస్తారము లెవ్వి యనిన—

సరిగ, గరిస, రిసగ

సగరి, గసరి, రిగస

౫వ ఉదా:— చతుర్హస్తుఁడైన విష్ణుమూర్తి శంఖ, చక్ర, గదా, పద్మములను తనహస్తంబుల నెన్ని విధముల ధరింపవచ్చును?

న్యాసము:—

ఇందు చేతులు ౪. ధరింపవలసినచిహ్నములు ౪. కావున ప్రస్తారభేదములు $= \lfloor\underline{\text{౪}} = \text{౪} \times \text{౩} \times \text{౨} \times \text{౧} = \text{౨౪}$.

౬వ ఉదా:— ౮, ౬, ౪, ౩, ౫ అను ఈయయిదుసంఖ్యలను గైకొని, అయిదుస్థానంబులు గలసంఖ్య లెన్ని యేర్పఱుపవచ్చును?

ప్రస్తారభేదములసంఖ్య $= \lfloor\underline{\text{౫}}$

$= \text{౫} \times \text{౪} \times \text{౩} \times \text{౨} \times \text{౧} = \text{౧౨౦}$.

౭వ ఉదా:—

"పాశాంకుశలు సర్పపతి శూల డమరుక
 శర శక్తి ఖట్వాంగ చాపసహిత
మహితకపాలముల్ మార్చి మార్చి ధరించు
 మూర్తిభేదము లెన్ని మొనయుచుండు?
శంకరునకు నట్లె చక్రగదాశంఖ
 పద్మంబుల ధరించి బాహువులను
అన్యోన్యకలితంబు లగునట్లు ధరియింప
 హరి కెన్ని భేదంబు లమరుచుండు?
లటుల సేనానిభుజముల నలరుశక్తి
చాప శర శూల శతచంద్ర చర్మ ముసల
లగుడ పట్టిస పరిఘాస్త్రలప్రసూర్త
ములను మార్చిన భేదముల్ కలుగు నెన్ని?"

ఇందలి మూఁడుప్రశ్నములలో

(౧) శివుఁడు పదిచేతులతో పది యాయుధములను ధరించు విధములు $= \lfloor\underline{\text{౧౦}} = \text{౧౦} \times \text{౯} \times \text{౮} \times \text{౭} \times \text{౬} \times \text{౫} \times \text{౪} \times \text{౩} \times \text{౨} \times \text{౧} = \text{౩౬౨౮౮౦౦}$.

(౨) విష్ణువునకు సంబంధించునది: మూఁడు ౫వ ఉదా.

(౩) కుమారస్వామి ౧౨ చేతులతో ౧౨ ఆయుధములు ధరించు విధములు $= \lfloor\underline{\text{౧౨}} = \text{౪౭౯౦౦౧౬౦౦}$.

౮వ ఉదా:—

$$\frac{\lfloor\underline{\text{౨న}}}{\lfloor\underline{\text{న}}} = \text{౧} \times \text{౩} \times \text{౫} \ldots (\text{౨న} - \text{౧}) \times \text{౨}^{\text{న}}$$ అని బుజువు [చేయుము.

$$\frac{\lfloor\underline{\text{౨న}}}{\lfloor\underline{\text{న}}} = \frac{\text{౨న}(\text{౨న}-\text{౧})(\text{౨న}-\text{౨})(\text{౨న}-\text{౩})(\text{౨న}-\text{౪}) \ldots \times \text{౩} \times \text{౨} \times \text{౧}}{\text{న}(\text{న}-\text{౧})(\text{న}-\text{౨})(\text{న}-\text{౩}) \ldots \text{౨} \times \text{౧}}$$

$$= \frac{\text{౨న}(\text{౨న}-\text{౧})\text{౨}(\text{న}-\text{౧})(\text{౨న}-\text{౩})\text{౨}(\text{న}-\text{౨}) \ldots}{\text{న}(\text{న}-\text{౧})(\text{న}-\text{౨}) \ldots \text{౩} \times \text{౨} \times \text{౧}}$$

$$= \frac{\text{౨}^{\text{న}} \times \text{న}(\text{న}-\text{౧})(\text{న}-\text{౨}) \ldots \text{౨} \times \text{౧} \times (\text{౨న}-\text{౧})(\text{౨న}-\text{౩}) \ldots \times \text{౩} \times \text{౧}}{\text{న}(\text{న}-\text{౧})(\text{న}-\text{౨}) \ldots \text{౨} \times \text{౧}}$$

$$= \text{౨}^{\text{న}}(\text{౨న}-\text{౧})(\text{౨న}-\text{౩}) \ldots \text{౫} \times \text{౩} \times \text{౧}$$

౩వ సూత్రము:— $^{\text{న}}\text{ప్}_{\text{ఇ}} = \text{న}(\text{న}-\text{౧})(\text{న}-\text{౨})(\text{న}-\text{౩}) \ldots (\text{న}-\overline{\text{ఇ}-\text{౧}}) = \text{న} \times {}^{\text{న}-\text{౧}}\text{ప}_{\text{ఇ}-\text{౧}}$

౪. సమానాంకసూత్రము:— 'క' వర్ణము లన్నియు నొక్కరకము, 'చ' వర్ణము లన్నియు నింకొకరకము, 'ట' వర్ణము లన్నియు వేఱొకరకమును ఉన్నయెడల అన్ని 'న' వర్ణములనుండి తడవకు 'న' చొప్పున నేర్పడు అంకపాశప్రస్తారవిధములు

$$= \frac{\lfloor\underline{\text{న}}}{\lfloor\underline{\text{క}}\,\lfloor\underline{\text{చ}}\,\lfloor\underline{\text{ట}}} \quad (\text{న} = \text{క} + \text{చ} + \text{ట})$$

౯వ ఉదా:— 'వికటకవి' అను పదమునందలి యన్ని యక్షరములతో నెన్ని వివిధము లైనమాట లేర్పడును?

ఇందు 'వి'లు ౨ను, 'క'లు ౨ను ఉన్నవి.

∴ పైసూత్రము ప్రకారము అంకపాశప్రస్తారసంఖ్య

$$= \frac{\lfloor ౫}{\lfloor ౨ \lfloor ౨} = \frac{౫ \times ౪ \times ౩ \times ౨ \times ౧}{\lfloor ౨ \times \lfloor ౨} = ౫ \times ౨ \times ౩ = ౩౦$$

ఇక్కడ 'చలుకవలుకలు' అనుమాటలో నున్న యన్నియక్షరములతో చేర్పదగుమాటలసంఖ్య $= \frac{\lfloor ౭}{\lfloor ౩ \lfloor ౩}$

$$= \frac{౭ \times ౬ \times ౫ \times ౪ \times ౩ \times ౨ \times ౧}{౩ \times ౨ \times ౧ \times ౩ \times ౨ \times ౧} = ౭ \times ౫ \times ౪ = ౧౪౦.$$

౧౦ వ ఉదా :— ౫, ౫, ౫, ౪, ౮ అను అంకెలస్థలములు మార్చి అయినంకెలసంఖ్య లెన్ని వ్రాయవచ్చును?

ఇందు అంకము లైదును, స్థానము లైదును అయినందున నిది మనకు ౨ వ సూత్రము ప్రకారము ప్రస్తారసంఖ్య $\lfloor ౫$ కావలయును. కాని యీయంకెలలో ౫, ౫, ౫ అనునవి మూడును ఒకటేవిధమైన యంకెలే కాన ప్రస్తారసంఖ్య తగ్గును. సమానాంకసూత్ర ప్రకారము ఇట్టియుదాహరణములలో సమానసంఖ్య లెన్ని యుండునో వాని యేకాదినాంకముతో పూర్వప్రకారము వచ్చినప్రస్తారములను విభజింపవలెను. ఇదివరకు వచ్చినప్రస్తారసంఖ్య $= \lfloor ౫ = ౧౨౦$. దానిని $\lfloor ౩ = ౬$తో భాగింపగా వచ్చినసంఖ్య ౨౦. కనుక నీయుదాహరణమునందు ౨౦ ప్రస్తారభేదములు కలుగు నని యర్థము.

౧౧ వ ఉదా :— బేసిసంఖ్య లెప్పుడును బేసిస్థానములం దుండునట్లుగా ౧, ౨, ౩, ౪, ౩, ౨, ౧ అనునంకెలతో నెన్ని సంఖ్య లేర్పరుపవచ్చును?

ఇచ్చినలెక్కలో ౧, ౩, ౩, ౧ అనునవి బేసియంకెలును, బేసిస్థానములును ౪.

కావున బేసియంకెలను, బేసిస్థానములందు $\frac{\lfloor ౪}{\lfloor ౨ \lfloor ౨}$ విధములుగ నుంచవచ్చును.

సరియంకెలను ౨, ౪, ౨ను సరిస్థానములలో $\frac{\lfloor ౩}{\lfloor ౨}$ విధముల నుంచవచ్చును.

$$\therefore \text{మొత్తము విధములు} = \frac{\lfloor ౪}{\lfloor ౨ \lfloor ౨} \times \frac{\lfloor ౩}{\lfloor ౨} = \frac{౪ \times ౩ \times ౨ \times ౩ \times ౨}{౨ \times ౨ \times ౨} = ౩ \times ౩ \times ౨ = ౧౮.$$

**౫ వ సూత్రము :—** ప్రతివస్తువును మనయిష్టము వచ్చినన్ని తడవలు మరలమరల తీసికొనినచో 'వ' వివిధవస్తువులనుండి తడవకు 'ఇ' వస్తువులచొప్పున నేర్పడు అంకపాశప్రస్తారసంఖ్య $వ^{ఇ}$.

ప్రతివస్తువును మనయిష్టము వచ్చినన్నిసార్లు మరలమరల తీసికొనుటకు వీలున్నది గనుక 'ఇ' స్థానములను వరుసగ 'వ' వస్తువులలో కొన్నిటితోమాత్రము నింపుటవలన ఏదియైన అంకపాశప్రస్తార మేర్పడును. ఇట్లు ప్రతిస్థానమును 'వ' విధములుగ నింపవచ్చును. 'ఇ' స్థానములను $వ^{ఇ}$ విధములుగ నింపవచ్చును.

∴ అంకపాశప్రస్తారసంఖ్య $= వ^{ఇ}$.

౧౧ వ ఉదా :— ప్రతిబాలుడును అన్ని బహుమానములను పొంద నర్హుడైనచో నలుగురకు ౫ బహుమానము లెన్ని విధములుగ నీయవచ్చును?

బాలురు నలుగు రున్నారు గనుక బహుమతులలో నేదియైన నొకటి ౪ విధములుగ నీయవచ్చును. పిదప మిగిలిన బహుమతులలో నేదియైన నొకటి ౪ విధములుగ నీయవచ్చును; ఏల యన నదివరకు బహుమతిని పొందినబాలుడయినను మరల బహుమతిని పొంద నర్హుడు.

ఇట్లు ౨ బహుమతులను $౪^{౨}$ విధములుగను, ౩ బహుమతులను $౪^{౩}$ విధములుగను, * * * * * * ౫ బహుమతులను $౪^{౫}$ విధములుగను ఈయవచ్చును.

$$\therefore ౪^{౫} = ౪ \times ౪ \times ౪ \times ౪ \times ౪ = ౧౦౨౪.$$

### అంకపాశప్రస్తారసంకలనము

అంకపాశప్రస్తారసంబంధములైన ప్రశ్నములందు కొన్ని యంకముల నిచ్చి వాని నెన్ని సంఖ్య[illegible] వచ్చునో ౪ వ సూత్రము వలన తెలిసినది. అట్టిసంఖ్యల [illegible] నంత మొత్తము వచ్చునో కనుగొనువిధ మిపుడు తెలుపబడును.

**౬ వ సూత్రము :—** ప్రశ్నమునందలి యంకము లన్నింటిని కూడగా వచ్చినమొత్తమును ప్రస్తారభేదసంఖ్యచే గుణించి, వస్తుసంఖ్యచే భాగింపగా వచ్చినహారమును ఒకదానిక్రింద నొకదానిని ఇష్టసంఖ్య ఎంతో అన్ని పర్యాయములు ఒక్కొకస్థానమువెనుక కుంచుచు కూడినయెడల అంకపాశప్రస్తారసంకలనము వచ్చును.

౧౨ వ ఉదా :— ౩, ౪, ౫ అను అంకెలను రెండుస్థానములు గలయెన్ని సంఖ్యలుగా వ్రాయవచ్చును? ఇట్టిసంఖ్యల మొత్త మెంత?

న్యాసము :—

ఇందులకు ప్రస్తారభేదములు $= {}^{౩}పా_{౨}$

$= ౩ \times ౨ \times ౧ = ౬$

మూడు అంకెల మొత్తము $= ౩ + ౪ + ౫ = ౧౨$

పైరెంటిని గుణింపగా వచ్చినసంఖ్య $= ౬ \times ౧౨ = ౭౨$

పైసూత్రము ప్రకారము $\frac{౭౨}{\text{వస్తుసంఖ్య}} = \frac{౭౨}{౩} = ౨౪$ ను

మననము చేసి, జీవితమును తరింపఁజేసికొనుటకై యీయంగుత్తరనికాయము 'తికనిపాతము'నందలి 'అనాగతభయము' ('అనాగతభయాని') లను సంబంధించినవిషయములను అశోకచక్రవర్తి తన 'బాభ్రా' శిలాశాసనమునఁ జెక్కించియుండెను. ఈవిషయములవలన ఈనికాయమునకుఁ బ్రజలలో నెట్టిగౌరవ ముండెనో, రాజులుకూడ నెట్టియాదరమును జూపుచుండిరో తెలియఁగలదు.

ఈయంగుత్తరనికాయమునకు సరియగుగ్రంథ మొకటి చీనాభాషయందుఁ గల దందురు. అనువాదము చేసినవారి గ్రంథముపేరు 'ఏకోత్తరాగమసూత్ర' మగును. 'సుత్తపిటకము' నందలి యంగుత్తరాదినికాయముల కాగమము లనియుఁ బేరు కలదు. అది క్రీ. శ. ౩౮౪-వ ప్రాంతమున ధర్మనందిచేతను చీనాభాషయం దనువదింపఁ బడెనట. నామసామ్యము ననుసరించి రెండుగ్రంథములు నొక్కటే యని యూహింప నవకాశ మున్నను చీనాగ్రంథమునందలివిభాగములకు అంగుత్తరాగమములోవలె 'నిపాతము'లని కాక 'వగ్గ'ము లని పే రుండుటవలన కొందఱు దీనినిగూర్చి యనుమానించుచున్నారు.

**అంగురు** — వెందనాదవరాగము: ఏడవ మేళకర్తయగు సేనావతీజన్యము. స గ మ ధ ని స - స ని ధ మ గ స యని ఆరోహణావరోహణముల సంచారము.

**అంగులేమి** — చార్లస్ డి వాలాయ్. ఇతఁడు ఫ్రెంచిరాజు తొమ్మిదవ చార్లెసునకుఁ బుత్రుఁడు. వాలాయ్ ప్రభువు. క్రీ. శ. ౧౫౭౩-వ సంవత్సరము, ఏప్రిల్ నెల ౨౮-వ తేది జననమందెను. ఇతనితండ్రి సంవత్సరములోపుగనే మృతి నొందెను. అతనికిఁ దరువాత ఫ్రాన్సుదేశమునకు రాజయిన యాతనిపినతండ్రి మూఁడవహెన్రీ తనయన్నగారిమాటను పాలించి ఈచార్లసు అంగులేమిని సంరక్షించెను. ఇతనికి మంచి విద్యాభ్యాసము చేయించెను. పదునాఱు సంవత్సరముల వయస్సుననే అంగులేమి మిక్కిలి ప్రాజ్ఞుఁ డనువిఖ్యాతి గనెను. ౧౫౮౯ లో మూఁడవహెన్రీ చంపఁబడెను. నాలవహెన్రీ రాజ్యమునకు వచ్చి మూఁడవహెన్రీ సిఫారసుమీఁద అంగులేమిని గొప్పపదవులకు నియోగించెను. అంగులేమితల్లి తొమ్మిదవచార్లెసు చచ్చినపిదప మఱియొకప్రభువును పెండ్లాడెను. వీరికి నైన సంతానమున హెన్రీయెట్టా యనుపుత్రిక యొకతె కలదు. ఆమె నాలవహెన్రీకి ఉంపుడుకత్తె యయ్యెను. దానిని సహింపక అంగులేమి యొకకుట్రయందు చేరెను. అది కనిపట్టఁబడ నితనికి నాలుగు మాసములు కారాగృహమునం దుండవలసివచ్చెను. మరల స్పెయిను రాజుతోఁ జేరి కుట్ర చేయుచుండుటవలన నితనిని పట్టుకొని ప్రాణదండన విధించిరి. ఈతని యాస్తి యంతయుఁ బోయెను. ఇతఁడు ౧౧ ఏండ్లు బందెయం దుండి విడుదల నంది మరలఁ దనయాస్తిపై స్వామ్యము సంపాదించుకొనెను. తరువాత నితఁడు రాజకార్యముల ధీరుఁడును, వీరుఁడు ననిపించుకొనెను. ఇతఁడు క్రీ. శ. ౧౬౫౦ లో ౭౭ సంవత్సరములవయస్సున మృతి నొందెను. ఫ్రెంచిభాషయం దితఁడు వ్రాసినగ్రంథములు మూఁడు కలవు.

**అంగూరు** — ఈ పేరను రెండుగ్రామములు, ఒకటి గంజాముజిల్లా పర్లాకిమిడితాలూకాయందును, రెండవది బళ్లారిజిల్లా హడగల్లి తాలూకాయందును ఉన్నవి. మొదటిది జమీందారీగ్రామము. దీనిజనసంఖ్య ౨౫౫. రెండవదానిజనసంఖ్య ౪౧౮.

**అంగేరిచెఱువు** — చిత్తూరుజిల్లా కాళహస్తితాలూకాయందలి యీనాంగ్రామము. దీనిజనసంఖ్య కేవలము ౬౪౪.

**అంగోనీలాండ్** (Angoni-land) — దక్షిణాఆఫ్రికాదేశమునందలి యొకభాగము. ఇది సముద్రపుమట్టమునకు ౪,౦౦౦ల అడుగులయెత్తున నున్న యొకపీఠభూమి. ఇందు నివసించు అంగోనీ లనునొకతెగప్రజలను బట్టి దీనికీ పేరు వచ్చినది.

**అంగోరా** — తుర్కిరాజ్యమున కిది రాజధాని. ఇది కాన్‌స్టాంటినోపిల్ నగరమునకు ౨౨౦ మైళ్లదూరమున నొకకొండమీఁదఁ గలదు. ఈకొండ ప్రాచీనదుర్గశిథిలావశేషములతో సుందరమై చూచుటకు సొంపుగ నుండును; కాని పట్టణ మంత బాగుగఁ గట్టఁబడినది కాదు. వీథు లిఱుకుగ నుండును. ఇందలియిండ్లు ఎండఁబెట్టినయిటికలతోఁ గట్టినవి. అయినను ఇచట ప్రాచీనము లైన గ్రీకు, రోమను, బిజాన్‌టైన్ వాస్తుశిల్పావశేషములు కడు మనోహరమైనవి కలవు.

ఇది చాల చరిత్రప్రాముఖ్యముగల నగరము. ఇది క్రీస్తునకుఁ బూర్వము ౨౫ లో రోమనురాష్ట్రమైనగలేషియాకు రాజధానిగ నుండెను. ప్రాచ్యరోమకసామ్రాజ్యకాలమునను ఇది చాల ప్రాముఖ్యము గలిగియుండెను. దీనిని పారసీకులును, అరబ్బులును ముట్టడించి పట్టుకొనిరి. అటుపిదప క్రీ. శ. ౧౩౬౦ లో నిది 'ఆటోమన్' తురుష్కులవశ మయ్యెను. క్రీ. శ ౧౪౦౨ లో అంగోరాప్రాంతమున నొకమహాసంగ్రామము జరగెను. అందు తార్తారువిజేత తైమూరు తుర్కిసుల్తాను బయిజీద్‌ను ఓడించి, బందీకృతునిఁ గావించెను. కాని ౧౪౧౫ లో మరల తురుష్కులు దీనిని స్వాధీనపఱుచుకొనిరి. అప్పటినుండి యిది 'ఆటోమన్' సామ్రాజ్యమునందే యుండెను. ౧౮౩౨ లో ఇబ్రహీమ్ పాషానాయకత్వమున ఈజిప్టుదేశీయులు దీనిని బట్టుకొనిరి.

ఉన్ని, మేకబొచ్చు, ధాన్యములు అంగోరానుండి యెగుమతియగువస్తువులు. ఇక్కడ మేకబొచ్చుతో బట్ట తయారగును. ఈనగరము తేనెకు, పండ్లకు ప్రసిద్ధి కెక్కినది.

౧౯౧౯ లో ముస్తాఫాకెమాల్ బయలుదేఱదీసిన తుర్కిజాతీయోద్యమమునకు ఫలితముగ ౧౯౨౦-వ సంవత్సరము ఏప్రిల్ నెలలో అంగోరాలో జాతీయప్రభుత్వ మేర్పాటయ్యెను. గ్రీకులును, వారియిరుగు పొరుగురాజ్యములవారికిని సుకరముగ ముట్టడించుటకు వీలులేనంతదూరమున నుండుటచేతను, అనటోలియాకు రైలుబాటుమీఁద

పోర్చుగలునందలి రాజకీయసభ కనుపఁబడుచుండును. ఇట్లు అంగోలా పోర్చుగలులోని మండలముగఁ బరిగణింపఁబడుచున్నది.

౨. అమెరికా సంయుక్తరాష్ట్రమునందలి డిలవేరుమండలమున నొకపట్టణము.

౩. అదే రాష్ట్రమునందలి యిండియానా మండలమున నొకపట్టణము.

౪. అదే రాష్ట్రమునందలి లూసియానా మండలమున మఱియొకపట్టణము.

౫. అదేరాష్ట్రమున న్యూయార్కుమండలమున నొకపట్టణము.

౬. ఉత్తరకరోలినాయం దొకపట్టణము.

౭. ఉత్తరకెలిఫోర్నియాయం దిలు కను నొకసముద్రశాఖ.

(గొ. హ.)

**అంగ్వ** — బర్మాలోని సగయాఁజిల్లాయం దొకపట్టణము. మొదట బ్రిటిషువారికి లోఁబడకమునుపు ఇది డాలా (Dala) రాష్ట్రమునకుఁ జెందియుండెను. ఆకాలమున దాని కిదియే ప్రధాననగరము. డాలారాష్ట్రపురాజొకఁడు ఉత్తమమగు చూర్ణవాన మొకటి తయారు చేయించెను. దానికి అంక్వ అనుపేరువచ్చినది. 'అంక్వ' అనుమాట కాశ్చర్యకర మయినది (Marvellous) యని యర్థము. నాఁటినుండియు నారాజ్యపుఁబ్రధాననగరమునకుఁగూడ నాపేరే వాడుక యైనది.

**అంగ్రాలీ** — గ్వాలియరుసంస్థానమున నొకప్రదేశము. ౧౮౦౩-వ సంవత్సరమున దౌలతురావుసింధియా దీని నింగ్లీషువారికి నొసఁగెను.

**అంఘాడ్** — బొంబాయిరాజధానియందు రేవాకాంత అను ఏజెన్సీయందలియొకచిన్నసంస్థానము. ఇప్పటి రాజు కోలీ అనఁగా మతరాసుజాతివాఁడు. దీనివిస్తీర్ణము ౨౨ చదరపుమైళ్లు. ఈసంస్థానమునం దొక్కటే గ్రామము కలదు. జనసంఖ్య ౨,౨౬౯. డౌలు ౫,౧౮౧. ఈసంస్థానపుప్రభువు సంవత్సరమునకు రు. ౧,౨౪౪ బరోడారా జయిన గాయకవాడునకు చెల్లింపవలయును.

**అంచనావతి** — షాడవషాడవరాగము. నలువదిమూఁడవమేళకర్త యగు గవాంభోధిరాగమున జన్యము. ఆరోహణావరోహణములందు సరిగమపధస — సధపమగరిస యని సంచారము.

**అంచలగచ్ఛ పట్టావలి** — అంచలగచ్ఛము శ్వేతాంబరజైనశాఖలలో నొకటి. గచ్ఛము లనుపేరఁ బరఁగు శ్వేతాంబరజైనశాఖలు ౮౪ కలవు. వీనిలో ఖరతర, తపా, అంచలాదిశాఖలు కొన్ని తక్కినవానికంటె గొప్పవి. అంచలగచ్ఛమునకు సంబంధించిన గురుపరంపరనుగూర్చి యీయంచలగచ్ఛపట్టావలి తెలుపును. మతాధిపతు లనఁదగు నీజైనగురువులకు సూరు లనియు, ఆచార్యు లనియు, పట్టధరు లనియును పేర్లు కలవు.

జినుఁ డనుపేరితోఁ జినమతమును వ్యాపింపఁజేసినమహావీరుఁడు మొదలుకొని ఖరతరగచ్ఛానుసారము నుప్పదిరెండవ, తపాగచ్ఛానుసారము ముప్పదియైదవ పట్టధరుఁ డగు ఉద్యోతనసూరివఱకును గల పట్టాధిపతు లన్నిగచ్ఛములకు నొక్కరే. ఉద్యోతనసూరియనంతరమే శాఖాభేదము లెక్కువయ్యెను. అంచలగచ్ఛమును క్రీ. శ. ౧౧౧౩-వ సంవత్సరమున ఆర్యరక్షితసూరి యను నాచార్యుఁడు స్థాపించెను. ఉద్యోతనసూరికాలమున నీగచ్ఛమునకు వడగచ్ఛ మని పేరు. తరువాత పాటన్ (అనహిలవాడపట్టణము) జిల్లాయందలి రాధనపురము సమీపమునందలి శంఖేశ్వరపార్శ్వనాథునిస్థాన మగు శంఖేశ్వర గ్రామమునుబట్టి యీగచ్ఛమునకు శంఖేశ్వర నామము కలిగినది. అటు పిమ్మట నీశాఖాస్థానము నానాటికి మునుముందునకు సాగుటవలన దీనికి నానావాలగచ్ఛ మని పేరు కలిగెను. ఇయ్యది ఆర్యరక్షితసూరి కాలమున విధిపక్షగచ్ఛ మని ప్రసిద్ధమై తుదకు అంచలగచ్ఛనామాంకిత మయ్యెను. దీని కీపేరు వచ్చుటకు రెండుకారణములు కలవందురు: ౧. శ్రావకులు సంబంధించినవారు గురువులకుఁ బ్రణామము లాచరించుకాలమున వస్త్రాంచలముల నిరుమోపుటచేఁ దీని కాపే రందురు. అంచలగచ్ఛనామము కలుగుటకు కిదియే కారణ మని కొందఱి మతము. ౨. చాళుక్యవంశజుఁ డైన కుమారపాలమహారాజు అనహిలవాడపట్టణమును పాలించుచుండినకాలమున ఆర్యరక్షితసూరిశిష్యుఁ డగు జయసింహుఁ డానగరమున మతబోధ గావించుచుండెను. ప్రజలెల్లరితోపాటు కుమారపాలుఁడు నాతని సభ కేగి వ్యాఖ్యానము జరుగుచున్నసమయమున ప్రత్యాఖ్యానోపవాసము నాతనిఁ గాక విశుద్ధశ్రావకుఁడే యాచరించునని యంగీకరించునో దా నప్పుడు నుండు ననియు, లేదేని సభ విడనాడి పోయెద ననియు నుడివెనట. అందులకు జయసింహుఁడు తాను తలపెట్టినప్రసంగము ముగిసినయనంతర మాప్రశ్నమునకుఁ బ్రత్యుత్తర మొసంగెద నని చెప్పెనట. ఆప్రసంగపుమహాత్మ్యమును గుర్తెఱుంగనివాఁ డగుటచేత కుమారపాలుఁ డందుల కంగీకరించెను. అటువెనుక కుమారపాలుఁడు తనగురువగు హేమాచార్యునికడ కరిగి, జరిగినయావద్వృత్తాంతమును దెలుప నతఁడు జయసింహుని ప్రస్తుతప్రసంగము ముగియుటకు పండ్రెండేండ్లు పట్టునని తెలియఁబఱచెను. అయినను తాను జయసింహున కొసంగినవాగ్దానమును తప్పక, యోపికపట్టి కుమారపాలుఁ డాపండ్రెండుసంవత్సరములును జయసింహునిప్రసంగమును అచలుఁడై యాలకించుచుండెను. ఇందువలన నీశాఖ తొలుత అచలగచ్ఛనామాంకిత మై తుద కంచలగచ్ఛముగ మాఱిన దని కొంద ఱందురు.

ఈశాఖవారికిని, ఇతరశాఖలవారికిని వ్రతానుష్ఠానాదులం దించుక భేదము కలదు. ఇతరశాఖాశ్రావకులు ప్రార్థనసమయములయందును, ప్రసంగావసరములందును నోటిని చిన్నవస్త్రఖండములతోఁ గప్పి

కొందరు కాని యంచలగచ్ఛశ్రావకు లట్లు కావింపరు. వీరు తీర్థంకరులను నమ్మి కొలుతురు; జైనులనలువదియైదుసూత్రగ్రంథములును వీరికిఁ బ్రమాణములు.

అన్నిగచ్ఛములకు నొక్కరుగనే యుండిన మొదటిముప్పది యైనమంది ప్రసిద్ధాధిపతులలోఁ బ్రథముఁడు మహావీరుఁడు.

౧. మహావీరుఁడు. ఇతఁడు తీర్థంకరులలో కడపటివాఁడు. చైత్రశుద్ధ త్రయోదశి యాతనిజన్మదినము: డెబ్బదిరెండుసంవత్సరములప్రాయమున కార్తికామావాస్యదినమున పావానగరమున నిర్వాణపదము నందెను. జైనమతసంస్థాపనాచార్యుఁ డితఁడే.

మహావీరునితరువాతిపట్టధరులనుగూర్చి ఖరతరగచ్ఛావళియందు సవిస్తరముగ వ్రాయఁబడెను గావున నిచట వారిపేరులు మాత్రమే యొసంగఁబడెను.

౨. సుధర్మసూరి
౩. జంబూసూరి
౪. ప్రభవసూరి
౫. శయ్యంభవసూరి
౬. యశోభద్రసూరి
౭. సంభూతివిజయసూరి
౮. భద్రబాహుసూరి
౯. స్థూలభద్రసూరి
౧౦. ఆర్యమహాగిరిసూరి
౧౧. ఆర్యసుహస్తిసూరి
౧౨. ఆర్యసుస్థితసూరి
౧౩. ఇంద్రదిన్నసూరి
౧౪. దిన్నసూరి
౧౫. సింహగిరిసూరి
౧౬. వజ్రసూరి
౧౭. వజ్రసేనసూరి
౧౮. చంద్రసూరి
౧౯. సమంతభద్రసూరి
౨౦. వృద్ధదేవసూరి
౨౧. ప్రద్యోతనసూరి
౨౨. మానదేవసూరి
౨౩. మానతుంగసూరి
౨౪. వీరసూరి
౨౫. జయదేవసూరి
౨౬. దేవానందసూరి
౨౭. విక్రమసూరి
౨౮. నరసింహసూరి
౨౯. సముద్రసూరి
౩౦. మానదేవసూరి
౩౧. విబుధప్రభసూరి
౩౨. విజయానందసూరి
౩౩. రవిప్రభసూరి
౩౪. యశోభద్రసూరి
౩౫. విమలచంద్రసూరి
౩౬. దేవసూరి
౩౭. నేమిచంద్రసూరి

౩౮. ఉద్యోతనసూరి: ఈతని కెనుబదినలుగురు శిష్యులు. వీరిలో సర్వదేవసూరి గురువునకుఁ బిదప పట్టధరుఁ డయ్యెను.

౩౯. సర్వదేవసూరి. ఇతనికిఁ బిదప

౪౦. పద్మదేవసూరి. ఇతఁడును ఉద్యోతనశిష్యులలో నొకఁడు: సాంఖ్యదర్శనవేత్తలఁ గొందఱ జైనమతావలంబులఁ గావించినకారణమున సాంఖ్యసూరి యని పేరు గాంచెను.

౪౧. ఉదయప్రభసూరి

౪౨. ప్రభానందసూరి. ఇతనికాలముననే ఈశాఖకు నానకగచ్ఛమను పేరు కలిగెను.

౪౩. ధర్మచంద్రసూరి
౪౪. సువినయచంద్రసూరి
౪౫. గుణసముద్రసూరి
౪౬. విజయప్రభసూరి
౪౭. నరచంద్రసూరి
౪౮. వీరచంద్రసూరి
౪౯. జయసింహసూరి

౫౦. ఆర్యరక్షితసూరి. ఇతనికాలమున నితనికిఁ గలిగినచక్రేశ్వరీదేవి స్వప్నము ననుసరించి యీశాఖకు విధిపక్షగచ్ఛ మను పేరు కలిగెను. ఇతఁడు ద్రోణాసికుమారుఁడు: వి. శ. ౧౧౩౬-వ సంవత్సరమున దంత్రాణ గ్రామమున జన్మించెను. వి. శ. ౧౨౧౨-వ సంవత్సరమున గురువువలన విజయచంద్రోపాధ్యాయసూరి యనుపేరు గాంచి, పిదప ఆర్యరక్షితసూరి యనునామముతోఁ బట్టధరత్వము నొందెను. ఇతఁడు ౨,౧౦౦ మంది సాధువులకును, ౧,౧౩౦ మంది సాధ్వులకును దీక్ష నొసంగెను. మఱియు నితనివలన పండ్రెండుగురు సాధువు లాచార్యపదమును, ఇరువదిమంది యుపాధ్యాయపదమును, డెబ్బదిమంది పండితపదమును, నూటముగ్గురు సాధ్వులు మహత్తరపదమును, ఎనుబదియిద్దఱు సాధ్వులు ప్రవర్తినీపదమును బొందిరి. ఇతఁడు నూఱుసంవత్సరములకాలము జీవించి వి. శ. ౧౨౩౬ నందు నిర్వాణపదము నందెను.

౫౧. జయసింహసూరి — ఇతఁడు వి. శ. ౧౧౭౯-వ సంవత్సరమున కొంకణదేశమందలి సోపారపురమున జనన మందెను. ఇతని తండ్రి కోటి ద్రవ్యనిధి: తల్లి నేఢి. ఇతఁడు ౧౧౯౩-వ సంవత్సరమున దీక్షఁగైకొని ౧౨౦౨ న సూరిపదము నొందెను. ఇతనికి ౧౨౩౬ న ఆచార్య, పట్టధరత్వములు లభించెను. ఇతఁడు ౭౯ సంవత్సరములప్రాయమున వి. శ. ౧౨౫౮-వ సంవత్సరమున నిర్వాణపదము నొందెను. ఇతని నిస్సంగత్వమహిమను వర్ణించు నీక్రిందిశ్లోకము ప్రసిద్ధమై యున్నది:

> "మాకీం ధునోతి స్మ విలోక్య యస్య
> నిస్సంగతాం విస్మితచిత్తవృత్తిః,
> శ్రీసిద్ధరాజా స్వసమాజమధ్యే
> సోఽభూత్త్రిత శ్రీజయసింహసూరిః."

౫౨. ధర్మఘోషసూరి — ఇతఁడు మార్వాడదేశమునందలి మహావపురమున వి. శ. ౧౨౦౮ లో జనన మందెను. ఇతని తండ్రిపేరు చంద్రవ్యవహారి: తల్లి రాజలదేవి. ౧౨౧౬-వ సంవత్సరమున దీక్షాగ్రహణము. ౧౨౩౬-వ సంవత్సరమున ఆచార్యపదప్రాప్తి. ఇతఁడు పదునెనిమిదిప్రశ్నోత్తరముల నొప్పుశతపది యనుగ్రంథమును వ్రాసెను. ఈతఁడే శాకంభరి యందలి మొదటిరాజును జైనమతమునకుఁ దీసికొనివచ్చినట్లు మేరుతుంగుఁడు తెలిపెను. ఇతఁడు ౫౯ సంవత్సరములప్రాయమున వి. శ. ౧౨౬౮ లో నిర్వాణము నొందెను.

ములయందే కాని పిత్తరోగమునందు చేయంజనదు (అ హృ. సూ. అ ౨౩. శ్లో ౪).

ఇంకను పిండము, రసము, చూర్ణము అని యంజనము మూఁడువిధములుగ నుపయోగపడుపవలెను.

పిండము — పిండ మనఁగా నాయావస్తువులచేతఁ జేయఁబడి ముద్దగా నుండునంజనము. దీనినే నేత్రములమీఁద వేసికూడ కట్టుదురు.

రసము చూర్ణము — రస మనఁగా వెనుకఁ జెప్పినద్రవరూపమగు నంజనము. మొదట నుదాహరించిన యమృతాంజనము మొదలగునవి గుండగా నుండు నంజనములు.

ప్రమాణము — పిండము తీక్ష్ణమైన ద్రవ్యములతోఁ జేయఁబడినచో బోడిసెనగంతయును, మృదుద్రవ్యములతో నిర్మింపఁబడినచో రెండింతలును ఉపయోగపడుపవలెను.

రసము తీక్ష్ణమైన ద్రవ్యములతో నిర్మింపఁబడినచో ౬ మొదలు ౮ వఱకును, మృదువైన ద్రవ్యములతో నిర్మింపఁబడినచో ౧౦ మొదలు ౧౨ వఱకును చుక్కలుపయోగింపవలెను.

చూర్ణమును తీక్ష్ణమైనచో ౨ శలాకలును, లేనిచో ౩ శలాకలు నుపయోగింపవలెను.

శలాక — ఇది లోహములతోఁ జేయఁబడి ౧౦ అంగుళములుపొడువు, వైరీపెన్సిలంత వలయమును కలిగి చివర గుండుగను, అంతయు నున్నగను ఉండవలెను. లేఖనమునందు తామ్రము (రాగి)తోఁ జేయఁబడినదియు, రోపణమునందు అంజనముతోఁ జేయఁబడినదియు, ప్రసాదనమునందు బంగారు లేక వెండితోఁ జేయఁబడినదియు నై యుండవలెను.

కాలము — రాత్రియందును నిద్ర లేనఁగనే పగలు ౧౦ మొదలు ౩ గంటలలోఁగా మబ్బుగా నుండినఁదిప్పఁ దక్కినప్పుడు ప్రాతస్సాయంకాలములయందును అంజనమును ప్రయోగింపవచ్చును.

అర్హులు — భయము, వమనము, విరేచనము - వీనిసాధనము చేసికొనుట, అప్పుడే భోజనము చేసియుండుట, మలమూత్రముల బంధించుట, కోపము, జ్వరము, సూక్ష్మమైనట్టివియు, మిక్కిలి ప్రకాశము కలిగినట్టివియు నగు పదార్థములను చూచి నేత్రములను శ్రమ చెందించుట, శిరోరోగము మొదలగునవి లేకుండ నుండువార లంజనప్రయోగమున కర్హులు. (అ. హృ. సూ. అ ౨౩) (శా. ఉ. ౧౩. అ.)

(శి. వ. రా.)

**అంజనవనము** — కోసలదేశమున సాకేతనగరమునకు దగ్గర నున్న యొక ప్రాచీనమగు నరణ్యము. ఇందే బౌద్ధసూత్రము లనేకములు వెలువడినవఁట.

**అంజనవేలు దుర్గము** — ఇయ్యది బొంబాయిరాజధానియందలిరత్నగిరిజిల్లాలోనిది యైనచిపులూర్ తాలూకాలో నున్నది. ఇచ్చట పశ్చిమసముద్రపు ఉప్పుకయ్య భూమిలోనికి వచ్చును. సముద్రపుటొడ్డున నున్న పర్వతముమీఁద నీదుర్గము కట్టఁబడియున్నది. ఈదుర్గముమీఁదనుండి వేసినఫిరంగిగుండు ఉప్పుకయ్యయొక్క ముఖము మీఁదివఱకుఁ బ్రసరించును. దుర్గము రెండెకరముల వైశాల్యము కలది. దీనికి మూఁడువైపుల సముద్రమును, ఒకవైపున ఖండమును కలవు. ఇప్పుడు కందకము పూఁడిపోయినది. కోటకుఁ బదునెనిమిదిబురుజులు కలవు. లోపల మూఁడుబావులు కలవు. పూర్వము మందిరములు పెక్కు లుండెను. కాని యిప్పు డవి శిథిలము లై పోయినవి. ఈదుర్గమును మొదటఁ బదునాఱవశతాబ్దియందు విజాపురపునవాబులు కట్టిరి. ౧౬౬౦ లో శివాజీ యీదుర్గమును పట్టుకొనెను. ౧౬౯౯ లో జంజీరాకు నవాబైనహబశీఖైరాతఖాను దీనిని స్వాధీనపఱుచుకొని దీనికిఁ గ్రిందిభాగమున పడకోట యని యొకకోటను కట్టెను. ౧౭౪౪ లో తులాజీ - అంగ్రే యనుమహారాష్ట్రవీరుఁడు హబశీయొద్ద నుండి యీదుర్గమును లాగుకొనిరి. ఇతఁ డీకోటకుఁ బైభాగమున బాలేకోట యనుకోటను నిర్మించెను. ౧౭౫౫ లో పూనాపేష్వా లీదుర్గమున కధిపతు లైరి. వారిసుబేదా రొకఁ డచ్చట నుండెను. ౧౮౧౮ లోఁ బేష్వాలరాజ్య మంతరింప మేనెల ౧౭-వ తేదీని కర్నల్ కెనెడీ ఈదుర్గమును స్వాధీనపఱుచుకొనెను. ౧౮౬౨ వఱకు నిచ్చట ౨౦౦ సిపాయీ లుండుచుండిరి. ఇప్పు డీకోట జనవిహీనమై జీర్ణస్థితియం దున్నది.

**అంజనావతి** — ఈశాన్యదిక్కునందు ఆఁడేనుగుపేరు.

**అంజనుఁడు** — శాక్యవంశమునకుఁ జెందినరాజు. గౌతమబుద్ధునిమాతామహుఁడు.

**అంజనేరి** (అంజని) — బొంబాయిరాజధానియందలి నాసికజిల్లా, నాసికతాలూకాలో నున్న యొకగుట్ట, పర్వతదుర్గము. ఆగుట్టక్రింద నున్నపల్లెకుఁగూడ నిదియే పేరు గలదు. ఇది నాసిక పట్టణమునకు ౧౪ మైళ్లమీఁద నుండును. కోటలో అంజనీదేవియాలయము కలదు. ఈశాన్యమువైపున యూరోపియనుల నిమిత్తము గట్టఁబడినబంగాళాలు మూఁడు కలవు. వాని కెదురుగఁ జక్కనికొలనొకటి కలదు. మూఁడువైపులను దానిచుట్టును జంబూ (నేరేడు) వృక్షములు కలవు. నాల్గవవైపుననుండి నాసికజిల్లా యంతయుఁ బటము విప్పి చూపినట్లు కనులకుఁ గానవచ్చును. ఈకొలఁకులకు మీఁదుభాగమునఁ బర్వతములలోపలఁ దొలువఁబడిన జైనదేవాలయ

నయు, చక్కియారులు చదువు స్వస్తివాచనములును దేవాలయ వృత్తులే. అయినను వీని నవలంబించు సేవకులుమాత్ర మేకకులజులు కారు. సాంఘికములగు గౌరవముల నందుటయం దీజాతివారు క్షత్రియులకు ముందు నత్తురు. జాతాశౌచములనుబట్టి కూడ వీరికి 'అంతరాళ' స్థానము తప్పకున్నది. అశౌచకాలము బ్రాహ్మణులకు పదిరాత్రములు. క్షత్రియులకు ౧౧ దినములు. నాయరు లాదిగాఁగల శూద్రులకు ౧౬ దినములు. అంబలవాసులు సాధారణముగ ౧౨ దినముల యశౌచమును బట్టుదురు. కొందఱు ౧౩, ౧౪ దినము లశౌచమును బట్టుట కలదు. కాని ౧౬ దినములుమాత్ర మెవ్వరు నవలంబింపరు. కొచ్చినురాష్ట్ర జనగణనకాలమం దంబలవాసులు దేవాలయసేవకై నియోగింపఁబడినవా రని నిర్ణయించిరి. ఉత్తమాధమజాతుల పరస్పరసంయోగమువలన నుత్పన్నమైన సంకరజాతులలో నీయంబలవాసులు చేరుదు రనియు, వీరు మగల జందెములు వేసికొనువారు, జందెములు వేసికొననివారు అని రెండుతెగలుగ నున్నా రనియు గణించిరి. ఈజాతివారి కెల్ల 'మరుమక్కత్తాయ'సంప్రదాయము, అనఁగా ఆఁడువారివారసత్వము ననుసరించి 'హక్కుభుక్తము'లు చెల్లుచుండును కాని 'మక్కత్తాయము' అనఁగా మగవారివారసత్వము ననుసరించి స్వామ్యము లబ్బుటయుఁ గొన్నియెడల జరుగుచున్నది. నాయరులవలె వీరిలో తాళిగట్టుపెండ్లి, సంబంధపుఁబెండ్లి యను రెండువిధము లగువివాహములును గలవు. జాతాశౌచములతరువాతి పుణ్యాహవాచనకములు నంబూద్రీబ్రాహ్మణపురోహితులచే నడుపఁబడును. కాని పిండశ్రాద్ధకర్మములను స్వకులజులే పురోహితులుగా నిర్వర్తింపఁజేయుదురు. బ్రాహ్మణులు వండినయన్నమును నంబూదిరీలు అంబలవాసులయిండ్లలో భుజింతురు. ఇందు మారారు లనుతెగవారిని కేరళ మనర్హులుగఁ బరిగణించుచున్నారు. వివాహసంతర్పణలయందును, వనభోజనములందును వీరు శాకభక్షకులుగ నెన్నఁబడుదురు. అంబలవాసిస్త్రీలు సంబంధవివాహములచే స్వజాతిపురుషులతోడను, బ్రాహ్మణ క్షత్రియులతోడను కలయుదురు. ఇప్పటికిని అంబలవాసిజాతివారు చాలమంది తమయానుపూర్వికవృత్తులలోనే చిక్కియుండుచున్నను, ఇటీవల విద్యాఫలము నంది యన్యవ్యాపారములఁ బ్రసక్తులై మెలఁగుచున్నారు.

**అంబలి** — బళ్లారిజిల్లాయందలి కూడ్లిగితాలూకాలోని యొకపల్లె. జనసంఖ్య ౨,౪౨౫. ఇచ్చట మిక్కిలి పురాతనమైన కల్లేశ్వరునిదేవాలయ మొకటి కలదు. అది యంతయు నల్లరాతితోఁ గట్టఁబడినది. ఇది పశ్చిమచాళుక్యరాజులకాలమునందు నిర్మింపఁబడినదిగఁ దోఁచుచున్నది. ఇట క్రీ. శ. ౧౦౯౧-౯౨, ౧౧౦౫-౦౬ సంవత్సరములందు ఆఱవవిక్రమాదిత్యచాళుక్యునిచే వేయింపఁబడిన రెండుశిలాశాసనములు గలవు. ఈగ్రామమునందలి హనుమంతుని దేవాలయమందును గూడ నొకశాసనము గలదు. అది పశ్చిమచాళుక్య వంశజుఁ డైన శెండపాజగదేకమల్లునిచే ౧౧౪౩-౪౪ లో వేయింపఁబడినది.

**అంబవరము** — ౧. నెల్లూరుజిల్లా కనిగిరితాలూకాయందలి జమీందారీగ్రామము. జనసంఖ్య ౪౩౫.

౨. కర్నూలుజిల్లా కంబంతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౧,౯౦౨.

౩. కడపజిల్లా, కడపతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౧,౭౫౧.

౪. కడపజిల్లా, జమ్మలమడుగుతాలూకాయందలి ఈనాంగ్రామము. జనసంఖ్య ౫౨౦.

**అంబవెల్లి** — గంజాముజిల్లా పర్లాకిమిడితాలూకాయందలి ఈనాంగ్రామము. జనసంఖ్య ౪౬౪.

**అంబష్ఠదేశము** — ఉశీనరునికొడుకగు సువ్రతునిచే నిర్మింపఁబడినరాజ్యము. ఇంద్రప్రస్థమునకుఁ బశ్చిమమున నుండినశిబిదేశమునకుఁ బశ్చిమమున నుండెను (భార. సభా. అ. ౩౨).

**అంబష్ఠుఁడు** — భారతయుద్ధమునందు దుర్యోధనుని పక్షమునఁ బోరాడినరాజు. అర్జునునిచేఁ జచ్చెను (భార. ద్రోణ. అ. ౯౩).

**అంబళ్లవలస** — గంజాముజిల్లా, శ్రీకాకుళము తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౪౩౩.

**అంబాకపల్లి** — కడపజిల్లా, పులివెందల తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౬౦౪.

**అంబాగఢచౌకీ** — మధ్యరాష్ట్రములలోని చాందాజిల్లాలో నొకచిన్నసంస్థానము. దీనిలో ఇనుము హెచ్చుగ దొరకును. ఇచ్చట వ్యవసాయము తక్కువ. చాలభాగ మిది యరణ్యమయము. దీనివైశాల్యము ౨౦౯ చ. మైళ్లు. ఇచ్చట నివసించుప్రజలలో గోండు లనునారణ్యకజాతివా రెక్కువగ నుందురు.

**అంబాజన్మము** — భారతవర్షీయతీర్థము.

**అంబాజిఇంగ్లియా** — గ్వాలియర్‌సంస్థానమందు మాధవరావుసింధియాయొద్ద ౧౭౯౭ మొదలుకొని సైన్యాధిపతుఁడుగ నుండెను. దౌలతరావుసింధియాయొద్దఁగూడ నితఁడు పనిచేసెను.

**అంబాజీదుర్గము** — మైసూరు సంస్థానమున కోలారుజిల్లాయందలి చింతామణితాలూకాలో విడిగానున్న యొకపర్వతదుర్గము. ఇది సముద్రపుమట్టమునకు ౪,౩౯౯ అడుగులయెత్తున నున్నది. ఈదుర్గము టిప్పుసుల్తాను కట్టించినది. ౧౭౯౧లో నిది ఆంగ్లేయుల వశ మయ్యెను. ౧౮౭౩-వ సంవత్సరమువఱకు కాప్రాంతముల నున్న 'సాబ్బలి' (శిడ్లఘట్ట ?) లన్నియుఁ గలసి అంబాజీదుర్గము అనుతాలూకాగా నేర్పడెను. వానికి చింతామణి ముఖ్యపట్టణముగ నుండెడిది.

**అంబాజీపేట** — తూర్పుగోదావరిజిల్లా అమలాపురం తాలూకాయందలి యొక గ్రామము. జనసంఖ్య ౫,౬౬౧. ప్రతి బుధవారము నిచ్చట గొప్పపశువులసంత జరుగును. గొప్పవర్తకస్థానము. కొబ్బరి త్రాళ్లకును, కొబ్బరినూనెకును నిది ప్రసిద్ధి కెక్కినది.

**అంబాడ్** — దక్షిణహైదరాబాదులో హైదరాబాదు నకు వాయవ్యమూలనున్న ఒక తాలూకా. దీని వైశాల్యము ౯౬౦ చ. మైళ్లు. మహారాష్ట్రులప్రాబల్యమంతరించినతరువాత నీ తాలూకా కొంతకాలము బ్రిటిషువారియధీనమున నుండెను. కాని తరువాతి వారు మరల దీనిని నైజాముకు నొప్పజెప్పిరి. అంబాడ్, జాంఖేడ్, రోహిల్ గఢ్ మొదలగునవి దాలుపట్టాము లీ తాలూకాలోని గ్రామములలో ముఖ్యమయినవి.

**అంబాపురము** — ౧. నెల్లూరుజిల్లా నెల్లూరుతాలూకా యందలి ఈనాం గ్రామము. జనసంఖ్య ౪౨౬.

౨. కర్నూలుజిల్లా ధోన్ తాలూకా యందలి గ్రామము. జనసంఖ్య ౫౯౯.

౩. కర్నూలుజిల్లా మార్కాపురం తాలూకాయందలి ఈనాం గ్రామము. జనసంఖ్య ౨౨.

౪. కృష్ణాజిల్లా, బెజవాడతాలూకా యందలి గ్రామము. జనసంఖ్య ౩౧౧.

**అంబాపూర్** — గంజాముజిల్లా, బరహాంపురము తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౩౯౯.

**అంబాభవాని** — బొంబాయిరాజధానియందలి యొక పుణ్యక్షేత్రము.

**అంబామనోహరి** — షాడవ - షాడవరాగము. ఇరు వదిమూడవ మేళకర్త యగుగౌరీమనోహరీరాగజన్యము. ఆరోహణావరోహణములందు సరిగమధనిస - సనిధమగరిస యని సంచారము.

**అంబాయదాసుపాలెము** — విశాఖపట్టణము జిల్లా శృంగవరపుకోటతాలూకాయందలి జమీన్దారీ గ్రామము. జనసంఖ్య ౧౦౬.

**అంబాయనా** — తూర్పు పసిఫిక్ మహాసముద్రమున దచ్చివారికిఁ జేరినమొలుక్కా దీవులలో నొకచిన్న దీవి. విస్తీర్ణము ౨౭౦ చదరపుమైళ్లు. సిరిమి, బోరో మొదలుగాఁగల చుట్టుపట్టులనుండు పెద్ద దీవు లన్నియు నీ అంబాయనామండలమునకుఁ జేరినవి. ఈదీవి గుట్టలచే నావరింపఁబడి యున్నను ఇచ్చట శీతోష్ణస్థితి సమముగా నుండును. భూకంపము లప్పుడప్పుడు తటస్థించుచుండును. టెంకాయచెట్లును, సగ్గుబియ్యపుచెట్లును ఈదీవియందు సాధారణములు. లవంగములును, జాజికాయయు నిచ్చటిముఖ్యోత్పత్తులు. తీరభూమియు, పర్వతముఖ్య భూమియు మిక్కిలి సారవంతములు. కాని విశేషభాగ మింకను సాగుబడిక్రిందికి రాలేదు. అంబాయనాపట్టణమే ఈదీవికి రాజధాని. క్రీ. శ. ౧౬౦౫ లో ఈదీవియు, నితరదీవులును పోర్చుగీసువారినుండి డచ్చివారు తీసికొనిరి. బహుకాల మీప్రాంతములలో నిడచ్చివారి రాజ్యమున కంబాయనా ముఖ్యస్థానముగా నుండెను. క్రీ. శ. ౧౬౧౯-౨౦ సంవత్సరము సంధివలన బ్రిటిషువారికి మొలుక్కా దీవులలో వ్యాపారము చేయుహక్కు గలిగెను. అంబాయనాయందు కిరస్థాన మొకటి యేర్పఱుపఁబడెను. కాని ౧౬౨౩ లో ననేకులు బ్రిటిషువారు డచ్చివారిచేఁ జంపఁబడినందున కిరివ్యాపార మాగి పోలసి వచ్చెను. ౧౭౯౬ లోను, ౧౮౧౦ లోను డచ్చివారినుండి అంబాయనాను బ్రిటిషువారు లాగికొనిరి గాని సంధి ననుసరించి మరల నిచ్చివైచిరి. అంబాయనాజనసంఖ్య ౩౦,౦౦౦.

**అంబాయపీయ** — సత్యలోకమునందలి యొక సరస్సు.

**అంబారీఫల్లకోట** — భూటాన్ రాజ్యములో నొక ప్రదేశము. భూటాన్ దేశాధిపతికిని, ఆంగ్లేయులకును గలవిరోధము సందర్భమున భూటాన్ రాజు తమ కపకారము గావించె నని, యంతకు ముందే కవ్వులునకు తమయధీనమునుండి అంబారీఫల్లకోటను ౧౮౬౩-వ సంవత్సరమున ఆంగ్లేయు లాక్రమించుకొనిరి. అటుపై ౧౮౬౫-వ సంవత్సరమున జరగిన యొడంబడిక ననుసరించి భూటాన్ రాజు స్వయముగనే దానిని శాశ్వతముగ నాంగ్లేయులకొ మొసఁగెను.

**అంబారుపేట** — కృష్ణాజిల్లా, నందిగామతాలూకా యందలి ఈనాం గ్రామము. జనసంఖ్య ౩౬౮.

**అంబాలాజిల్లా** — పంజాబుదేశమున ఢిల్లీడివిజనునం దుత్తరపువైపుజిల్లాలలో అంబాలాజిల్లా చివరిది. ఇది ౩౦° ౨', ౩౧° ౧౩' ఉ. కును, ౭౬° ౧౯', ౭౭° ౩౬', తూ. కును నడుమ నున్నది. వైశాల్యము ౧,౮౫౧ మైళ్లు. ఇది ఉత్తరమున సట్లెజ్ నది మొదలుకొని యమునానదివఱకును వ్యాపించియున్నది. ఈజిల్లాయొక్క యాకారము విషమముగా నున్నది. ఒకదానితో నొకటికి సంబంధము లేని రెండుప్రదేశములు కలసి యేర్పడినది.

**స్వాభావిక స్వరూపము**

జిల్లాయందలి దక్షిణభాగము ఘగ్గర్ యమునానదులకు నడుమ నున్నది. సివాలిక్ గుట్టలవంపునకు నైరృతదిక్కున క్రమక్రమముగా తగ్గుచు నేర్పడినమైదానమే యీ ప్రదేశము. ఇయ్యది గుట్టలమీఁదనుండి ప్రవహించెడి కాలువల వలన వచ్చు ఒండ్రువలన సారవంతమైనది. అచ్చటచ్చట కలుకునేల కలదు. ఇట్టిప్రదేశములును, ముఖ్యముగా నారాయణగఢతాలూకాయును ఎక్కువగా వర్షము కురిసినఁ గాని ఫలవంతములు కావు. కావున అప్పుడప్పు డిచ్చట కఱవులు సంభవించుట కలదు. ఈజిల్లాలో అంబాలా, ఖరడ్, జగాధ్రి, నారయణగఢము, రూపర్ అనునవి యైదుతాలూకాలు గలవు.

ఈజిల్లాలోఁ బెక్కునదులును, చిన్న యేఱులును కలవు. యమునానదికిఁ బశ్చిమమునఁ గట్టఁబడిన ఆనకట్ట, అందుండి తీయఁబడిన కాలువ మొదలయిన నీటిపాఱుదలసంబంధమైనవిషయముల విచారించుముఖ్య కార్యాలయ మీజిల్లాలో తజవాల యనుగ్రామమునందుఁ గలదు. రూపారునొద్దనే సర్ హింద్ కాలువ ప్రారంభమైనది. ఈశాన్యభాగము కొంత తప్ప జిల్లా యంతయు సింధుగంగానదులయొండ్రువలన నేర్పడిన ప్రదేశము. ఈశాన్యభాగము హిమాలయసంబంధమైన శివాలిక్ కొండలకు సంబంధించినది. ఇందు ఇసుకరాలును, గులకరాలును విశేషముగాఁ గలవు. వృక్షములనుబట్టి యీజిల్లాను మూఁడుప్రదేశములుగా విభజింపవచ్చును. దక్షిణమున నున్నది గంగానదియొక్క గుత్తరప్రదేశము. ఈశాన్యమునను న్నది శివాలికపర్వతమునకు సంబంధించినది. కలసర్ అడవియు, మోర్నిగుట్టలయడవియు నీభాగమునందే కలవు. కసౌలి యను మూఁడవది ౬,౦౦౦ అడుగులు ఎత్తున నున్నది. ఈయరణ్యములలో నచ్చటచ్చట పెద్దపులులు కలవు. చిఱుతపులులు, సింహములు, జింకలు, తేళ్లు విశేషముగా నుండును.

ఈజిల్లాయందలి మైదానములలోనికాలమానము సామాన్యముగా సమప్రదేశముగనే యుండును. కాని పర్వతములు సమీపమున నున్నందున వేఁడిమి యొకప్పు డెక్కువగను, ఒకప్పుడు తక్కువగను నుండును. సరాసరి మధ్యమోష్ణము జనవరిలో ౩౯'౮౫° ను, జూనులో ౯౯.౫౫° లును ఉండును. వర్షమానము భిన్నభిన్నప్రదేశములలో భిన్నభిన్నముగా నుండును. సరాసరి సంవత్సరమునకు రూపారులో ౨౮ దుక్కులును, కసౌలిలో ౬౧ దుక్కులును వర్షము కురియును.

చరిత్ర

ఈజిల్లాచరిత్రమునకుపై మనము నమ్మఁదగిన మిక్కిలిపురాతన లేఖ ఏడవశతాబ్దియందు మనదేశమునకు వచ్చిన బౌద్ధయాత్రికుఁడు యువాన్ చాంగు వ్రాసిన వ్రాతయే. అప్పు డిది నాగరకత గలిగి, వైభవదశయందున్నయొకరాజ్యము. స్రుఘ్ననగరము దీనికి రాజధాని. జగాద్రికి సమీపమున నున్న సుఘ్ అనఁబడు నిప్పటిపల్లె యున్నచోటనే యీ గ్రామ ముండెనని పండితులయభిప్రాయము. ఈప్రదేశము ఉత్తరదిక్కునుండి వచ్చెడివారి త్రోవలో నున్నందున హిందూదేశముమీఁదికి దండెత్తి యుత్తరమునుండి వచ్చినవా రందఱును ఈమార్గమునఁ బోయినవారే.

క్రమముగా ఢిల్లీరాజ్యము మరాటీవారిప్రహరణములచేతను, అఫ్గానుల దాడులచేతను సత్త్వహీనము కాఁగా పదునెనిమిదవశతాబ్ది యుత్తరార్ధమున సిక్కువీరులు కొందఱు తమసాహసముచే సట్లజ్ నదిని దాటి సట్లజ్, యమునలకు నడుమ నున్నప్రదేశమును వశపఱుచుకొని చిన్నసంస్థానములను నిర్మించుకొనిరి. ౧౮౦౩ లో మరాటీవారిబలము తగ్గి యింగ్లీషువారు ప్రభువులు కాఁగా ఈసంస్థానము లన్నియు నొకవిధమున స్వతంత్రము లయ్యెను. ఇందు పాటియాలా, జింద్, నాభా మొదలయిన పెద్దసంస్థానములును, కొన్నిపల్లెలుమాత్రము గల ప్రభువులును ఉండిరి. పంజాబుదేశప్రసిద్ధమైన రణజిత్తుసింగు తన రాజ్యప్రభవమును హెచ్చించుకాలమందు సట్లజ్‌నది దాటి యీసంస్థానములమీఁదికి దండెత్తి వచ్చెను. అప్పుడు వీరందఱును ఇంగ్లీషువారిని శరణు చొచ్చిరి. అప్పు డింగ్లీషువారు ౧౮౦౯ లో రణజిత్తుసింగుతో సంధి చేసికొని యాతఁ డీసంస్థానములను జొరకుండఁ జేసిరి. ఈసంస్థానికులు తమలోఁ దామ పోరాడకలయనియు, ఏవియైనను పోరాటము లున్నయెడలఁ దమకుఁ జెప్పి తీర్మానించుకొనవలయు ననియును ౧౮౧౧ లో బ్రిటిషుప్రభుత్వమువా రాజ్ఞాపించిరి. ఈరాజుల కందఱకుఁ దమతమరాజ్యములలోఁ గొందఱకుఁ, దమతమగ్రామములలో కొందఱకు సర్వవిధము లయిన ప్రభుత్వాధికారములు నుండెడివి. భూమిసిస్తు రాఁబట్టుకొనుట, అపరాధులను విచారించి దండించుట, సొత్తునుగూర్చిన వివాదములను పరిష్కరించుట మొదలయినయధికారములన్నియు వారికే యుండెను. గవర్నరుజనరలు ప్రతినిధిగా అంబాలాలో నొకబ్రిటీషు అధికారి యుండెను. అతనికి నీసంస్థానాధీశులపైఁ గొంతయధికార ముండెను. ఈరాజులు బ్రిటిషువారి కేమియు నివ్వలేదు. సంస్థానాధీశులు అపుత్రకులై మృతి నొందినయెడల వారిరాజ్యము బ్రిటిషువారికి సంక్రమించునట్టి యేర్పాటుమాత్ర ముండెను. మొదటి సిక్కుయుద్ధమునందును, ౧౮౪౫ లోని సట్లజ్ దాడియందును ఈసంస్థానాధీశులు బ్రిటిషువారికి నేమియు సాయము చేసినవారు కారు. తిరుగఁబడకమాత్ర ముండిరి. అందుచే వారియధికారములను లాగివేయుటకు నేర్పాటు చేయఁబడెను. అంబాలాలో నున్నప్రతినిధికి (ఏజంటు) మాఱుగా చీఫ్ కమిషనర్ అనుబలసంతుఁడైనయధికారి ఏర్పడెను. పోలీసు అధికార మంతయు బ్రిటిషుఅధికారుల కిచ్చివేసిరి. రెండవసిక్కుయుద్ధము జరిగి పంజాబుదేశ మంతయు బ్రిటిషువారికి స్వాధీనపడిన తరువాత ౧౮౪౯-వ సంవత్సరపు జూనునెలలో ఈసంస్థానములకు నదివఱకుఁ గలప్రభుత్వాధికారము లన్నియు లాగివేయఁబడినవి. భూమిసిస్తుమాత్రము రాఁబట్టుకొనునధికారము వారికి నుంపఁబడినవి. భూములకుఁ బరము తేర్పఱచునధికారముకూడ బ్రిటిషుప్రభుత్వము వారే తీసికొనిరి. ఇంతకుఁ బూర్వమే వారసులు లేనందునఁ గొన్ని సంస్థానములు బ్రిటిషువారికి సంక్రమించెను. ఈమార్పులవలన నీజిల్లా యంతయు సంక్రమించెను.

ఈజిల్లాలో ౫ పట్టణములును, ౧,౨౧౮ పల్లెలును కలవు. ఇందలిపెద్దపట్టణములు అంబాలా, జగాద్రి, రూపర్, సాఢౌర్, బూరియాలు. ఇచ్చట మ్యునిసిపాలిటీ లున్నవి.

జనులు

జనసంఖ్య ౮,౧౫,౮౮౦. ఇందు ౧౦౦-కి ౬౨ రు హిందువులు, ౩౦ మంది మహమ్మదీయులు, ౯ గురు సిక్కులు, మిగిలినవా రితరమతస్థులు. రూపర్, ఖరర్ తాలూకాలలో పంజాబీభాషయు, మిగిలినతాలూకాలలో హిందీభాషయు మాటలాడెదరు. ఇచ్చటిజనులలో ౧౧౦-కి ౫౧ రు వ్యవసాయమువలనను,

౧౯ మంది చేతిపనులవలనను, ౪ గురు వర్తకమువలనను, ౩ గురు ఇతర వృత్తులవలనను జీవించెదరు. ఈజిల్లాలో జాట్ జాతివారెక్కువగ నున్నారు. భూస్వాములలో వీరె యెక్కువ. సంఖ్యలో పిదపవారు రాజపుత్రులు. రాజపుత్రులలో చందువంశులవారు మహమ్మదీయులు. ఒకవంశమువారు హిందువులు.

జిల్లాయందలిభూమిలో ౧౦౦ కి ౬౪ వంతులు భూమి సేద్యమైనది. ౩౬ వంతులు భూమి బంజరుగా నున్నది. సేద్యమైన భూమి ౧,౧౯౫ చదరపుమైళ్లు. సాగయిన భూమిలో ౧౦౦-కి ౯ వంతులు అనఁగా ౭౧ చదరపుమైళ్లు పల్లపువ్యవసాయముక్రింద నున్నది. అందు ౪౩ చదరపుమైళ్లు బావులక్రిందిపొలములును, ౨,౨౯౬ ఎకరములు కాలువలక్రిందిపొలములును, ౨౩ చదరపుమైళ్లు చెఱువుల, వాఁగుల క్రిందిపొలములును కలవు.

*వ్యవసాయము*

ఈజిల్లాలో పండునట్టి ముఖ్యమైనపైరులు గోధుమ, శనగలు మొదలైనకాయధాన్యములు, జొన్నలు, ప్రత్తి, మొక్కజొన్నలు, వరి, మండువ, చెఱకు. ౧౯ చదరపుమైళ్లుగలయడవులు ౪ చోట్ల రిజర్వుగా, అనఁగా కొట్టకుండ నుంచఁబడినవి.

కొన్నిగుట్టలలో సున్నపురాయి విశేషముగా నున్నది. కంకరరాయియుఁ గలదు. పర్వతముమీఁదనుండి వచ్చు వాగులలో నచ్చటచ్చట బంగారుపొడిని గొందరు తీయుదురు. అంబాలాలో చక్కనిజంబుఖానాలు నేయుదురు. నూలుచేయుయంత్రశాలలు ౪ ను, నూనె తీయు యంత్రశాలలు ౩ ను, [illegible] పిండిమర లయియు నను చెంపుపనులను జేయునట్టియంత్రశాలలు ౯ ను గలవు. ఈజిల్లాలో మఱియుఁ జెక్కయంత్రశాల లున్నవి. అంబాలా, రూపర్ వర్తకస్థలములు. జగాధ్రి యనుచోట రాగి, యిత్తడిపాత్రల వర్తకము విశేషముగా నున్నది. పలిగారపువర్తకమునుగూడ నచ్చట గలదు. కురావి యనుచోట బట్టలవర్తక మెక్కువగా జరగును. సంవత్సరమునకు ౫ లక్షలరూకలను బేరము జరగు నని చెప్పెదరు. ఈజిల్లాలో రెండు ఇనుపదారులును, ౪ కంకరరోడ్లులును కలవు. యమునానది దాఁటుటకు చలికాలమునందు బోట్లతో వంతెన కట్టఁబడును. ఇచ్చట ౧౮౬౦-౧, ౧౮౬౮—౯, ౧౮౯౦, ౧౮౯౭, ౧౮౯౯, ౧౯౦౦ సంవత్సరములలోఁ గఱవు తటస్థించెను. వీని యన్నిటిలో మొదటికఱవువలన జనులు విశేషముగా బాధపడిరి.

*వృత్తులు, వ్యాపారము, వర్తకము*

ఈజిల్లాలో నైదుతాలూకాలు గలవు: అంబాలా, జగాధ్రి, నారాయణగఢ్, రూపార్, ఖరర్. చివరరెండుతాలూకాలును గలసి రూపర్ సబుడివిజను ఏర్పడినది. తాలూకాను ఇచ్చట తహస్సీ లనియెదరు. ఒక్కొక్కతాలూకాకు నొకతహస్సీలుదారు, నాయబ్‌తహస్సీలుదారు అనునిద్దఱు అధికారు లుందురు. జిల్లా యధికారిపేరు డిప్యూటీకమిషనర్. ఇతనికి సహాయులుగా నల్గురు అసిస్టెంటుకమిషనరులు లేక ఎక్స్‌ట్రా అసిస్టెంటుకమిషనరు లుందురు. వారిలో నొకఁడు రూపర్ సబుడివిజనుపనియు, మఱియొకఁడు జిల్లాఖజానాపనియుఁ జూచుచుండును. పోలీసుసంబంధమైన డిప్యూటీ యిన్‌స్పెక్టర్ జనర లనునధికారి యంబాలాపట్టణమునం దుండును.

*పరిపాలనా విభాగములు*

డిప్యూటీకమిషనరు జిల్లా కంతకును మేజస్ట్రేటయినందున అపరాధవిచారణసంబంధమైన న్యాయవిచారణ కంతకు నతఁడే కర్త. అసిస్టెంటు, ఎక్స్‌ట్రా అసిస్టెంటుకమిషనరులకుఁ గూడ నధికార ముండును. సొత్తుసంబంధమయిన వివాదములను పరిష్కరించుటకు డిస్ట్రిక్ట్‌జడ్జి యొకఁడు కలఁడు. జిల్లా మేజస్ట్రేటునకును, జిల్లాజడ్జికిని పైయధికారి డివిజనల్ జడ్జి అనునతఁ డొకఁడు కలఁడు. అంబాలాలో నొకటియు, జగాధ్రిలో నొకటియు, రూపరులో నొకటియు నిట్లు మూఁడుమునసబుకోర్టులు గలవు. వీరు గాక కొందఱు కాంటోన్మెంటు మేజస్ట్రేటులును, ఆనరరి మేజస్ట్రేటులును కలరు.

సిక్కుప్రభుత్వమునప్పుడు భూమిసిస్తు ధాన్యరూపముగా నుండెను. బ్రిటిషుప్రభుత్వము వచ్చినతరువాత నాధాన్యమునకే వెల గట్టి సిస్తు ధనరూపముగ వసూల్చఁబడెను. ౧౮౪౭ మొదలుకొని ౧౮౫౭ వఱకును భూమికి సిస్తు తేర్పఱుపఁబడి క్రమమయిన అమరకము (Settlement) ఏర్పాటుచేయఁబడెను. ౧౮౮౨ మొదలుకొని ౧౮౮౯ వఱకును రెండవసారి యమరకము చేయఁబడెను. మెరక భూమికి ఎకరమునకు ౫ అణాలు మొదలుకొని రు. ౨, ౨ అణాల వఱకును పల్లపుభూములకు రు. ౨, అ. ౪. మొదలుకొని రు. ౫ వఱకును సిస్తులు కలవు. జిల్లాసిస్తు రు. ౧౩,౮౦,౦౦౦.

ఈజిల్లాలో చదువుకొనినవారు నూటికి ౪, ౩ కలరు. అంబాలాలో నొకమిషనుహైస్కూలును, జగాధ్రిలో నొకగవర్నమెంటు హైస్కూలును, ఒక సెకండరీపాఠశాలయు, పెక్కులు ప్రాథమిక పాఠశాలలును గలవు.

ఈజిల్లాలో అంబాలాపట్టణమునం దొక పెద్ద ఆస్పత్రియు, ఇతరస్థలములందు ౭ చిన్న ఆస్పత్రులును గలవు. అంబాలాపట్టణమున అమెరికామిషనువారివలన స్థాపింపఁబడిన కుష్ఠవైద్యశాలయు, స్త్రీ వైద్యశాలయుఁ గలవు.

**అంబాలాతాలూకా** — అంబాలాజిల్లాయందలి యొకతాలూకా. దీని వైశాల్యము ౩౬౦ చదరపుమైళ్లు. జనసంఖ్య ౧౭౦,౮౦౬. ఇందు అంబాలాపట్టణమును, ౨౯౫ పల్లెలును గలవు. సిస్తు రు. ౨,౮౦,౦౦౦.

## అంబాలాపట్టణము

— పంజాబుదేశమందలి అంబాలాజిల్లాకు ముఖ్యపట్టణము. నార్తువెస్టరన్ రయిల్వేమీఁదను, ఉత్తరదిక్కునకుఁ బోవు రాజమార్గముమీఁదను ఉన్నది. ఈరెంటికిని అంబాలాయొద్దనే ఢిల్లీ-అంబాలా కాల్కా యను యినుపదారి యొద్ద

ముగాఁ బోవుచున్నది. ఈపట్టణము జెగనాడి కుత్తరమున రమారమి వేయిమైళ్లదూరమున నున్నది. జనసంఖ్య ౭౮,౬౩౮. అందు హిందువులు ౩౯,౬౦౧, సిక్కులు ౨,౧౬౮, మహమ్మదీయులు ౩,౨౧,౪౯౮, క్రైస్తవులు ౩,౬౧౦. హిందూదేశమునందుఁగల గొప్పకంటోనుమెంటులలో నిది యొకటి. కంటోనుమెంటు అనఁగా సైన్యములు నివసించుస్థలము. అంబాలాపట్టణమునకును, అంబాలాకంటోనుమెంటునకును నాలుగుమైళ్లయంతరము గలదు. అంబ యనునామెను స్థాపించుటచే నంబాలా యని పేరు వచ్చె నని యనియెదరు. అచ్చట నొక జమీందారీ యుండెను. ఆ జమీందారునకు సంతానము లేనందున ౧౮౨౩ లో బ్రిటిషువారికి సంక్రమించెను. అచ్చట పొలిటికల్ ఏజంటు బ్రిటిషువారిప్రతినిధియై యుండెను. ౧౮౪౩ లో నచ్చట కంటోనుమెంటు ఏర్పడెను. ౧౮౪౯ లో నిది యీజిల్లాకు ముఖ్యపట్టణముగ నేర్పడెను. ఇది వర్తకమునకు ముఖ్యపట్టణమయి యున్నది. నాణ్యము ప్రత్తివర్తక మిచ్చట విశేషముగా నున్నది. పర్వతపట్టణమయినసిమ్లాకు నిచ్చటనుండియే ఓడలు పంపఁబడును.

ఇచ్చట ౧౮౬౭లో మ్యూనిసిపాలిటీ (పట్టణపారిశుద్ధ్యసంఘము) యేర్పడెను. ఈపట్టణమునందు మూఁడు హైస్కూళ్లును, రెండు మిడిల్‌స్కూళ్లును, ఒక యాస్పత్రియుఁ గలవు.

**అంబాలిక, అంబిక** — కాశిరాజు కూఁతులు. అంబకుఁ జెల్లెండ్రు. భీష్ముని సవతితమ్ముఁడగు విచిత్రవీర్యుని భార్యలు. అంబిక పెద్దది. అంబాలిక చిన్నది. విచిత్రవీర్యుఁడు సంతానము లేకనే మరణముఁ జెంది శ్రీవేదవ్యాసుఁడు సత్యవతియాజ్ఞ ననుసరించి దేవరన్యాయమున అంబికయందు ధృతరాష్ట్రుని, అంబాలికయందు పాండురాజును పుట్టించెను. పాండురాజు మరణము నొందినకొలఁది కాలములోనే వీరు తమయత్తయైన సత్యవతితోఁగూడి తపోవనంబునకుం జని ఘోరతపంబు నేసి కొండొకకాలంబునకు శరీరంబులు విడిచి పుణ్యగతికిఁ బోయిరి.

**అంబాలీ** — బరోడాసంస్థానమునందలి సినోర్ సబ్‌డివిజనులో నొకగ్రామము. ఇందు అనసూయాదేవియాలయ మొకటి కలదు. ఈయాలయమున కడుసునన్న మట్టి యొడలికిఁ బట్టించుకొన్నను, ఈదేవి స్నానమాడిననీటి నొడలిపైఁ బోసికొన్నను కుష్ఠరోగము నశించిపోవునఁట. అందుచేత ఆరోగముచేఁ బీడింపఁబడువారెందఱో యీగ్రామమునకు వచ్చి నివసించుచుందురు. ఇట్లు వచ్చువారికై ప్రత్యేకముగ బరోడామహారాజుగారు కట్టించిన యాసుపత్రి యొకటికూడ నిందు కలదు.

**అంబాసముద్రముగ్రామము** — అంబాసముద్రముతాలూకాకు ముఖ్యస్థలము. తామ్రపర్ణీనదిమీఁద ఉత్తరతీరమున తిరునల్వేలిపట్టణమున కిరువదిమైళ్లపై భాగమున నున్నది. ఇచ్చట యూనియను పంచాయతీ గలదు. ఒక హైస్కూలున్నది.

**అంబాసముద్రముతాలూకా** — మద్రాసురాజధానియందలి తిరునల్వేలిజిల్లాలోని యొకతాలూకా. ఇది ఉత్తరఅక్షాంశముల పొడుము నొద్ద ౮° ౨౯', ౮° ౫౭' ఉ. కును, ౭౭° ౧౨', ౭౭° ౪౦' తూ. కును నడుమ నున్నది. దీని వైశాల్యము ౪౯౧ చదరపుమైళ్లు. జనసంఖ్య ౧,౮౩,౬౧౬. జనులయొత్తిడి ఒక్కచదరపుమైలునకు ౩౭౯౪ నున్నది. భూమిసిస్తు, పన్నులు కలసి సంవత్సరమునకు రాబడి (డిమాండు) రూ. ౪,౭౪,౦౦౦. ఈతాలూకాలో తామ్రపర్ణీనదివలనను, దానియుపనదులవలనను వ్యవసాయమునకు మిక్కిలి సదుపాయము గలుగుచున్నది. అందువలన ప్రతిసంవత్సరము తప్పక రెండు వరిపంటలు పండుచున్నవి. తామ్రపర్ణీనది కచ్చటచ్చట ఆనకట్టలు కట్టి వ్యవసాయమునకు నీరు పాఱుదల చేసికొనుపద్ధతి పురాతనకాలమునుండియుఁ గలదు. ఈ పద్ధతి యచ్చట పూర్ణతను జెందియున్నది. ఈనదులవల్ల పాఱుదల యైనభూమి తప్ప ఈతాలూకాలోని యితరభూమి పాషాణమయము. సారవంతమయినది కాదు. ఈతాలూకాలో సింగంపట్టి, ఉర్కాడ్ అను రెండుజమీందారీలు కలవు. ఈరెంటికిని వ్యవసాయమునకు నీటివసతి కలదు. తామ్రపర్ణీనదియొడ్డునను, నీటిపాఱుదలప్రదేశమునను ధనవంతులైన బ్రాహ్మణులు, వ్యవసాయకులు వాసము చేయుచున్నపల్లెలును, పట్టణములును పెక్కులు కలవు. వీరి తెలివితేటలవలనను, సాహసమువలనను తాలూకాకు సంపద కలిగిన దని చెప్పవచ్చును. అంబాసముద్రము తాలూకాకు ముఖ్యపట్టణము. వీరవనల్లూరు (జనసంఖ్య ౧౭,౩౨౭), కల్లిడైకురిచి (౧౪,౯౧౩), సెర్మాదేవి (౧౩,౪౭౪) అనునవి తాలూకాయందలి గొప్పపట్టణములు. పాపనాశన మనునొకక్షేత్రము గలదు. ఇవిగాక ౮౪ పల్లెలు గలవు.

**అంబిక** — ౧. బొంబాయిరాజధానియందలి సూరత్ జిల్లాలో నొకనది. వాసదాకొండలలోఁ బుట్టి బరోడారాజ్యము గుండా ప్రవహించుచున్నది. అటుపై సూరతుమండలమునుండి ప్రవహించి 'బుల్సారు'కు దక్షిణమున సముద్రములోఁ గలయుచున్నది. సముద్రమునఁ గలయుచోటికి కైదాఱుమైళ్లకు వెనుక ఫర్లాంగుపైఁగ వెడల్పు గలిగినరెండువంతెన లున్నవి. దీనికి కావేరి, ఖరేరా యను ఉపనదులు రెండు కలవు. అంబికానదిపై బిల్‌గోరా వఱకు పెద్దపెద్దయోడలు ప్రయాణము చేయుటకుఁగూడ నవకాశము కలదు.

౨. అంబిక యనుపేరుగల గ్రామ మొకటి వంగదేశమునందలి వర్ధమానమండలమునఁ గలదు.

**అంబికపల్లి** — ఇది గోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకాలోని గ్రామములలో నొకటి. జనసంఖ్య కేవలము ౨౭౬.

**అంబికాదత్తవ్యాస** (సాహిత్యాచార్య) — హిందీ సంస్కృతభాషల రెంటను సుప్రసిద్ధుఁ డయిన మహాపండితుఁడు. అసమానప్రతిభగల శతావధాని. ఇతనిపూర్వికులు రాజపుత్రస్థానమున

నుండిరి. ఇతని పితామహుఁడు పండిత రాజారామశర్మ కాశీనగరము నివాసముగ నేర్పఱచుకొనెను. ఆతనికి దుర్గాదత్తుఁడు, దేవీదత్తుఁడు నని యిరువురు పుత్త్రులు కలిగిరి. దుర్గాదత్తుఁడు ప్రసిద్ధకవి యయ్యె. ఆతని పుత్త్రులలో జ్యేష్ఠుఁ డీయంబికాదత్తుఁడు.

ఇతఁడు క్రీ. శ. ౧౮౫౮-వ సంవత్సరమున జనన మందెను. ఐదేండ్లు వచ్చునప్పటి నితని విద్యాభ్యాసము ప్రారంభించిరి. ఇతఁడు పుట్టుకచేతనే ప్రతిభాశాలి. అందును ఇంటియందలి స్త్రీలందఱును విద్యావతు లయి యుండినందున నీతని ప్రతిభ కడుత్వరగాఁ జూపట్ట మొదలిడెను. శైశవపు టాటపాటలలోనే ఇతఁడు శబ్దరూపావళియు, అమరకోశమును కంఠస్థములు చేసికొనెను. ఎనిమిది తొమ్మిది సంవత్సరములవాఁ డగునప్పటికి గానవిద్యయందు కొంత పరిశ్రమచేసి కవిత్వము చెప్ప నారంభించెను. గోస్వామి శ్రీకృష్ణచైతన్యుఁడు మహోద్దండ కవియై యుండెను. ఆతనిగీతములను అంబికాదత్తుఁడు పఠించిపఠించి ఒక్కసంవత్సరములోపల కవిత్వతత్త్వముల నెఱింగికొని నిండు సభల యందు సమస్యాపూర్తి చేయ మొదలిడెను. అంత చిన్నవయస్సుననే ఇతఁడు మహారాజ కాశీరాజులవారి ధర్మసభవారివలన పారితోషికమును బడసెను. ఇట్టి చిన్నతనమునందే యీతనికీర్తిని దిగంతగతముచేయఁగలుగునట్టి యొకకార్య మొదవెను. తెలుఁగుసీమనుండి యొక యష్టావధాని (ఆతని పేరు తెలియరాలేదు) ఉత్తరహిందూస్థానమునకుఁ బోయి యచ్చటి మహాపండితుల నందఱను చకితులఁజేసి నిలిపెట్టెను. అప్పు డీయంబికాదత్తవ్యాసుఁడు శతావధాన మొనరించి ఆయాంధ్రకవిసింహుని మెప్పించి ఆతనివలన 'సుకవి' బిరుదము నందెను.

పదునాఁడేండ్ల ప్రాయమున నీతఁడు సంస్కృత మభ్యసించుట చేయ నారంభించెను. వ్యాకరణము, సాంఖ్యము, సాహిత్యము, వేదాంతము మున్నగుగహనవిషయములతోఁగూడ గానవాద్య సంబంధ మయిన కళలనుగూడ నభ్యసించెను. ౧౮౭౫లో నీతఁడు కాశీనగరము నందలి రాజకీయసంస్కృతకళాశాలను ప్రవేశించి ఒకసంవత్సరమునం దచ్చటి యుత్తమపరీక్షయందు నేరి ౧౮౭౯-వ సంవత్సరమున నాచార్య పరీక్ష నిచ్చి మఱుసటియేఁట సాహిత్యపరీక్షయం దుత్తీర్ణుండై ప్రభుత్వమువారివలన సాహిత్యాచార్యపదవి నందెను.

అదే సంవత్సరమున నీతనితండ్రి పరలోకగతుం డయ్యెను. కుటుంబమున కలహములు పొడముటచేత నితఁడు కలకత్తాకు పోయి మూఁడుమాసము లచ్చట నుండి తనవిద్యాప్రభావమున పేరు గాంచి మరలి యిలుసేరెను. నాఁటనుండియు నవధానములు చేయుట కారంభించి ధారణాశక్తిని వృద్ధిచేసికొని ౨౪ నిమిషములలో శతకమును రచించుపటిమను సంపాదించి కాశిలోని బ్రహ్మామృతవర్షిణి సభవారివలన నొక రజతపతకమును, 'ఘటికాశతక' బిరుదమును నందెను.

ఇన్ని యుండియు నీతనికర్థము మాత్రము లేకుండెను. కావున నితఁడు ౧౮౮౦లో మధువనమునకుఁ బోయి యచటి విద్యాశాలలో ౩౫ రూపాయల నౌకరిలోఁ బ్రవేశించెను. అచ్చట నుండి నితఁడు సంస్కృతసంజీవనీసమాజమును స్థాపించెను. ఆసమాజము మూలమున నేఁటికిని విహారమువనుండి ప్రతిసంవత్సరమును నూర్లకొలఁది విద్యార్థులు సంస్కృతమున శిక్షనంది బయలుదేఱుచున్నారు.

అంబికాదత్తుఁడు మధువనమునుండి బాంకిపురమునకును, అక్కడనుండి ముజఫరుపురమునకును, భాగల్పూరునకును ఉద్యోగ ధర్మము ననుసరించి పోవలసినవాఁడాయెను. భాగల్పూరునం దుండఁగ సామవత్ నాటకమును సంస్కృతమున రచించి దర్భంగారాజునకు సమర్పించెను. శివరాజవిజయ మను గ్రంథమునుగూడ నదేభాషయందు రచించెను. ఆసమయముననే ఈతనికి 'భారతరత్న' మనియు, 'శతావధాని' యనియు బిరుదములు లభించెను. అయోధ్యానరేశుఁ డొకస్వర్ణపతకముతో నితని బహూకరించెను.

ఇట్లు చిన్నపెద్ద లందఱిచేతను గౌరవింపఁబడు చుండిన యీతనికి పాట్నాకళాశాలలో (౧౮౯౭-౧౮౯౯) ప్రొఫెసరుపని దొరకెను. కాని యితఁ డప్పటికే వ్యాధిగ్రస్తుఁ డయియుండినందున నాపదవియం దుండుభాగ్యము నందఁడాయెను. ఈతఁడు ౧౯౦౦ సంవత్సరము నవంబరు ౧౯-వ తేదినాఁడు పరలోకప్రాప్తిఁ జెందెను.

అంబికాదత్తవ్యాసుఁ డాంగ్ల బంగాళిగుజరాతీత్యాదిభాష లెఱుంగినవాఁడు. హిందీయందును, సంస్కృతమునందును ౭౯ గ్రంథములను వ్రాసినవాఁడు.

(హిం. కో. ర.)

**అంబితాపల్లి** — గంజాముజిల్లా, కొడోలాతాలూకా ఆటగడజమీన్దారీయందలి గ్రామము. జనసంఖ్య ౩౩౫.

**అంబితాపొల్లి** — గంజాంజిల్లా కొడోలాతాలూకా కళ్లికోట జమీన్దారీలోని గ్రామము. జనసంఖ్య ౧౨౯.

**అంబిలిపొదోరొ** — గంజాంజిల్లా ఛత్రపురంతాలూకా బిరిదిజమీన్దారీలోని యొక గ్రామము. జనసంఖ్య ౯౧.

**అంబివాలీ** — బొంబాయిరాజధానియందలి థానాజిల్లాలో నొక గ్రామము. దీనికి సమీపముననే అంబివాడీ యనుపర్వత గుహ యొకటి కలదు. ఇందు ౪౨ అడుగులపొడువు గలిగి చాల విశాల మయినవసారా యొకటియు, రెండుద్వారములును గలవు. వసారాకు మూఁడుదిసల నాలుగేసిగదులు, నడుమ నొకసింహాసనము నున్నవి. దీనిచుట్టును చిత్రశిల్పసుందరము లైన ప్రాకారపుగోడలు శిథిలమై కడు జీర్ణములై యున్నవి. ఇందలి స్తంభములు మొదలగునవి మనోహరశిల్పములతో నలరారుచున్నవి. ఇవి యన్నియు కొండను దొలిచి నిర్మించినవే. మొత్తముమీఁద నీకట్టడ మంతయు నాసికలోని గుహలపద్ధతి నున్నది. వసారాకు నడుమఁ గలస్తంభములపై నేదియో వ్రాయఁబడియున్నది. కాని యది కొంచెమైనఁ జదువుట కనుకూలముగ నుండలేదు.

**అంబుఆబాదీ** — గంజాంజిల్లా అస్కాతాలూకా ధారాకోటజమీన్‌దారీలోని గ్రామము. జనసంఖ్య కేవలము ౧౬౫.

**అంబుగాం** — ఇది గంజాంజిల్లా ఇచ్ఛాపురంతాలూకా సురంగిజమీన్‌దారీలోని గ్రామము. దీనిజనసంఖ్య ౨౫౩. ఇదే పేరు గల మఱియొక గ్రామము సోంపేటతాలూకా మంజుసాజమీన్‌దారీలో నున్నది. ఇక్కడి జనసంఖ్య ౭౧౪.

**అంబుధార** — తొమ్మిదవ దక్షసావర్ణిమన్వంతరంబు నందు బుట్టఁబోవు ఋషభనామక విష్ణ్వవతారమునకుం దల్లి.

**అంబుమతి** — భారతవర్షీయ తీర్థము.

**అంబులురెడ్డి** — రంపపితూరీనాయకులలో నొకఁడు. ఇతనినివాసము బోడులూరు. ౧౮౪౯-వ సంవత్సరము జూలై ౧౦-వ తేదీనాఁ డితఁడు రేకపల్లి ప్రజలసాయమున వడ్డిగూడెంపోలీసు స్టేషను ముట్టడించెను. ఆయేఁటినవంబరునెలలోనే గవర్నమెంటువారు అంబులు రెడ్డిని పట్టుకొనిరి.

**అంబువాహిని** — భారతవర్షీయనది (భార. భీష్మ. ౨౯).

**అంబుశిఖరోపూర్** — గంజాంజిల్లా కోదోలాతాలూకా ఆసగడజమీన్‌దారీకిఁ జెందిన యొక గ్రామము. జనసంఖ్య ౩౫౩.

**అంబుసోలి** — గంజాంజిల్లా తెక్కలితాలూకాలోని జమీన్‌దారీ మొఖాసా గ్రామము. దీనిజనసంఖ్య ౮౩౪.

**అంబూదరపల్లి** — చిత్తూరుజిల్లా చిత్తూరుతాలూకా యందలి గ్రామము. ఇక్కడిజనసంఖ్య ౬౫౫.

**అంబేరుపురము** — విశాఖపట్టణముజిల్లా, వీరఘట్టం తాలూకాయందలి జమీన్‌దారీ గ్రామము. జనసంఖ్య ౧,౩౨౬.

**అంబేలా** — బునర్ ప్రదేశమందలి యొకపర్వతమార్గము. వాయవ్యపుపొలిమేరపరగణా (నార్తువెస్టు ఫ్రాంటియరు ప్రావిన్సు) లోని దగు పెషావరుజిల్లాయొక్క ఈశాన్యదిక్కుపొలిమేరకు దాపుల ఈ ప్రదేశము ౩౦° ౨౮' ఉ. కును, ౭౨° ౩౦' తూ. కును నడుమ నున్నది. పిండారినాయకులలో నొక్కఁడగు సయ్యదు అహమద్ శాహ యనువాఁడు ౧౮౨౪లో నలువదిమందిసహచరులతోఁ గూడఁ బాఱిపోయి పెషావరుజిల్లాకుఁ దగిలియున్న ప్రాంతమునందు యూసుఫ్జై అనుజనులలోఁ గలసి నివాస మేర్పఱచుకొనెను. అచ్చట నుండి ౧౮౨౭ లో సిక్కులచేఁ దఱిమివేయఁబడినందున నతఁడు కొన్నిదినములు స్వాత్తులో నుండి తుదకు బునరు చేరెను. ౧౮౨౯లో పెషావరు స్వాధీనము చేసికొనెను. పఠాను లయినయతనిశిష్యులతనిపైఁ దిరుగఁబడిరి. అంత నాతఁ డచ్చటనుండి పాఱిపోయి సింధునది దాఁటి బాలాకోటలో నుండెను. అచ్చట సిక్కులనాయకుఁ డైనషేర్‌సింగు అతనిని బీడించి చంపెను. అతనిశిష్యులలో బ్రతికి యున్నవారు సిత్తానా యనుపల్లెకుం బాఱిపోయి యచ్చట స్థాపించిన గురుమక్కలు సయ్యదు అక్బరుషాహా యనువానిని గురువుగ జేసికొని, యచ్చటనే నిలిచిపోయిరి. అప్పటినుండియు నాస్థలము హిందూస్థానమునుండి పాఱిపోయినరాజద్రోహాపరాధులకును, ఘాతుకులకును, సైన్యమునుండి తప్పించుకొని పోయినవారికిని శరణాలయ మయ్యెను. ఇంగ్లీషువారు పంజాబును స్వాధీనపఱచుకొనినతరువాత సిత్తనాషుక్కులవలన వారిరాజ్యమునకు బాధ కలుగఁజొచ్చెను. అందువలన ౧౮౫౩ లోను, ౧౮౫౮ లోను ఇంగ్లీషువారు కొంతసైన్యమును బంపి యాగురుమక్కలను కొంతవఱకు వశపఱచుకొనిరి. వారు సిత్తానాను విడిచి మాల్కా అనుచోట నివసించిరి. అప్పటినుండియు వారు హిందూదేశమునుండి వచ్చెడివర్తకులను బాధపెట్టఁజొచ్చిరి. ౧౮౬౩ లో సిత్తానాలో మఱునివాస మేర్పఱచుకొనిరి. అందుచే నాసంవత్సరమున తొమ్మిదివేలసైన్యముతో సర్ నెవిల్ చాంబర్‌లేన్ అనుసేనాధీశుని నింగ్లీషుదొరతనమువారు వారిమీఁదికి పంపిరి. ఈదాడిలో ఇంగ్లీషుసైన్యములోనివా రిరువదునాలుగురు నాయకులును, నలుగురు హైందవనాయకులును, ౨౧౯ మంది సైనికులును హతులైరి. ౬౭౧ మంది గాయపడిరి. మొత్తముమీఁద దాడియొక్క యుద్దేశము సఫలమయ్యెను. బునర్‌నివాసులు వశులైరి. గురుమక్కలయొక్క నివాసస్థలమగుమాల్కాను కాల్చివేసిరి.

**అంబోగామ్** — ౧. గంజాముజిల్లా, సోంపేట తాలూకా మంజుసాజమీన్‌దారీయందలి గ్రామము. జనసంఖ్య ౩౨.

౨. గంజాముజిల్లా, ఇచ్ఛాపురం తాలూకా, చీకటిజమీన్‌దారీయందలి గ్రామము. జనసంఖ్య ౧౩౧.

**అంబోగోడా** — గంజాముజిల్లా, బరహాంపురము తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య. ౮౫౬.

**అంబోపల** — విశాఖపట్టణముజిల్లాకుచేరిన విస్సంకటకపు 'ఏజెన్సీ' యందలి జమీన్‌దారీ గ్రామము: జనసంఖ్య ౧,౨౩౨.

**అంబోవాలి** — గంజాముజిల్లా, అస్కాతాలూకా యందలి గ్రామము. జనసంఖ్య ౪౫.

**అంబోపూవ** — గంజాముజిల్లా, గుమ్సూరుతాలూకా యందలి గ్రామము. జనసంఖ్య ౧,౫౬౯.

**అంబోలీ** — బొంబాయిరాజధానిలోని సావంతవాడి సంస్థానమం దున్న ఆరోగ్యస్థలము. ఇది పడమటికనుమలయందు మన సముద్రముకంటె ౨,౩౦౦ అడుగులయెత్తున నున్నది. ఇచ్చటనుండి సృష్టిశోభ చక్కఁగఁ గానవచ్చును. ఇచ్చట వెన్నెలను ఎండయు విశేషముగా నుండవు. కాలమాన మెప్పుడును సుఖప్రదముగా నుండును. దీని జనసంఖ్య ౧,౩౪౧.

**అంభట** — యునైటెడ్ ప్రావిన్సెస్, అనఁగా ప్రయాగ రాజధానిలోని సహారన్‌పూర్ జిల్లాయందలి నకూర్ తాలూకాలోని యొక గ్రామము. దీనిజనసంఖ్య ౫,౭౫౧. హిందువులకన్న మహమ్మదీయులు రెండురెట్లెక్కువ గలరు. ఇది మొదట మొగలులసైన్యమునకు నివాసస్థలముగ ఫిరోజ్ షాహా తుఘ్లక్ అనువానిచేఁ గట్టింపఁబడియె. అప్పుడు దానికి ఫిరోజాబాదు అని పేరుండెను. ఇప్పటి పట్టణ మీఁదులఁ గట్టఁబడినది. ఇందు రెండు మసీదులు గలవు. అందొకటి హుమాయూనురాజ్యకాలమునందుఁ గట్టఁబడినది. పదునేడవ శతాబ్దియందు మరణమొందిన షాహ అబ్దుల్ గనీ యనువానిగోరీ మాడుటు కెంపుగా నున్నది. ఈపట్టణమునందు తెలుపులమీఁది సొగసైన నెక్కడపుఁబని చేసెదరు.

**అంభిణి** — ఒకదేవకన్య. సూర్యునియొద్ద బ్రహ్మవిద్య నేర్చికొనెను.

**అంభిభువు** — కౌరవరాజపుత్త్రుఁడు. భారతయుద్ధమునందు పాండవపక్షమున యుద్ధము చేసెను (భార. ద్రో. ౧. అ ౨౩).

**అంభోజిని** — షాడవ-షాడవరాగము. ఇరువదెనిమిదవమేళకర్త యనుహరికాంభోజిరాగజన్యము. ఆరోహణావరోహణములయందు సరిగమధనిస - సనిధమగరిస యని సంచారము.

**అంభోరుహము** — షాడవ-సంపూర్ణరాగము. నలువదినాల్గవమేళకర్తయగు భవప్రియరాగజన్యము. ఆరోహణావరోహణములందు సరిగపధనిస - సనిధపమగరిస యని సంచారము.

**అంభోరుహుఁడు** — విశ్వామిత్రునిపుత్త్రులలో నొక్కఁడు (చూడుఁడు: విశ్వామిత్రుఁడు).

**అంశము** — ౧. రాగాలాపనమున జీవస్వరము: (చూడుఁడు: రాగాధ్యాయము).

౨. నా. ధనంజయుఁడు.

**అంశుఁడు** — గోకులమందలి కృష్ణబలరాములసఖుఁడు. (భాగ. స్కం. ౧. అ ౨౨).

**అంశుధానపురము** — భాగీరథీతీరమందలి యొక నగరము.

**అంశుమంతుఁడు** — ౧. ద్వాదశాదిత్యులలో నొక్కఁడు. ఇతని భార్య క్రియ.

౨. (సూ. వం.) ఇక్ష్వాకు కులోత్పన్న సగరరాజపౌత్త్రుఁడు. అసమంజసునిపుత్త్రుఁడు. దిలీపునకుఁ దండ్రి. భగీరథునకుఁ దాత. అసమంజసుం డరణ్యమునకుఁ బోయినతరువాత సగరుఁ డితనిని యజ్ఞాశ్వమును వెదకుటకై పంపెను. ఇతఁడు వెదకుచు కపిలాశ్రమమునకుం బోయి, అశ్వంబును, భస్మీభూతులైన అఱువదివేలమందిపినతండ్రులను జూచి వారి నుద్ధరించుకొఱకై, కపిలుని ప్రార్థన సేయుచు నిలుచబడియుండెను. కొంతతడవునకుఁ గపిలుండు సమాధినుండి ముక్తప్రసన్నుఁడై యితనికి సగరునియశ్వంబొసంగి తాతచే నశ్వమేధంబును బూర్తిచేయింపు మని యాజ్ఞ నొసంగెను; సగరపుత్త్రుల నుద్ధరించుటకు భగీరథుని ప్రార్థింపు మని చెప్పెను. అంత నంశుమంతుఁ డశ్వమును దీసికొనిపోయి సగరునిచే నశ్వమేధంబును చేయించెను. సగరుఁ డితనికి రాజ్యంబు నప్పగించి యరణ్యంబునకుం బోయెను. ఇతఁడు రాజ్యభార మంతయు మంత్రులపై నుంచి గంగావతరణమునకై తప స్సాచరించెను గాని యిష్టసిద్ధి యగుటకుఁ బూర్వమే దేహమును విడిచెను. పితరులకన్యయైన యశోద యితని భార్య (భార. వన. అ. ౧౦౭); (వా. రా. బాల. స. ౪౧-౪౨)

౩. ద్రౌపదీస్వయంవరంబునకుం బోయిన రాజులలో నొక్కఁడు.

౪. పాంచాలవంశీయ రాజు. భారతయుద్ధమునందు నర్జునునిచేఁ జచ్చెను.

**అంశుమతి** — భారతవర్షమందలినది. కాళిందికి నీపేరు గలదు (వా. రా. అయో. స. ౫౫).

**అంశుమద్భేదము** — దేవాలయములు, భవనములు, దేవతావిగ్రహములు మొదలయినవానిని నిర్మించుటనుగూర్చినవివరములను బోధించు నొకపుస్తకము.

**అంశువర్మ** — క్రీ. శ. ౭-వ శతాబ్దియందు నేపాళదేశము నేలినరాజు. మొదట నితఁడు ఆదేశమునకు రాజుగ నుండిన శివదేవుఁ డనువానికి సామంతుఁడై యుండి యటుపై నొకమారు శివదేవుఁడు శత్రువులతోడి పోరాటమున మునిఁగియుండినయపుడు గనిపట్టి నేపాళరాజ్యసింహాసన మాక్రమించుకొనెను. ఇతనిపరిపాలనకాలము ప్రాయికముగ ౬౧౦-౬౪౬ వ యుండవచ్చును. అంశువర్మ గొప్పపండితుఁడు, శూరుఁడు.

**అంశువు** — ౧. అశ్వినీదేవతలయాశ్రితుఁడు. (ఋగ్వే. ౮. ౫. ౨౬).

**అక్‌సంకర్** — ఇతఁడు లాహోరునగరమునకుఁ జెందిన వీరాగ్రేసరులలో నొకఁడు. క్రీ. శ. ౧౨౪౦-వ సంవత్సరమునందు మంగోలియాజాతివారు హిందూదేశమునందుఁ బ్రవేశించి లాహోరునగరముపైఁ బడఁగా తత్కాలమున పాలకుఁడైన మలిక్ ఇఖ్తియార్ ఉద్దీన్ కారాకష్ శత్రువుల నెదిరింపఁగల సన్నాహమున లేకుండెను. కావున మంగోలులు అదను దొరకినందులకు మిగుల సంతసించుచు లాహోరును నాశన మొనరింపసాగిరి. ముసల్మానుల రెండుకతులుమాత్రము మంగోలుల నెదిరించినవి. వానిలో నొకదానికి అక్‌సంకర్ నాయకుఁడు. ఇతఁడు బైర్ అను మంగోల్ సేనానితోడ నతి ఘోర

